# ముందుమాట

---o---

## కవిసామ్రాట్

# శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారు

శ్రీ "కొర్నెపాటి శేషగిరిరావుగారు" విరచించిన "మహాకాళీన" మన్న మహా గ్రంథము వారి కుమారు డందంద వినపింప వింటిని. ఈ కవికి తెలుఁగు నుడి కారము చాల చక్కఁగ తెలియును. కల్పన లాశ్చర్యముగ చేయగలడు. ఈ కథా నిర్మాణము లోననే ఈయన కల్పనా సామర్థ్యము విశదమగు చున్నది, ఈయన ప్రయోగించిన ప్రయోగములు, చేసిన శబ్దశ్లేషలు, వాడిన పలుకుబళ్ళు సర్వత్ర హృదయంగమముగ నున్నవి. ఈయన సామాన్యుడైన కవిగాడు. ఇన్నాళ్ళు మరుగునపడి యుండుటయే నాకు ఆశ్చర్యముగ నున్నది, ఈయన శివుని వర్ణించిన సీసపద్యమే చాలును; ఈయనను ఎంతయైనను ప్రశంసించ వచ్చును. ఇంత చక్కటి గ్రాంథిక భాష మీది ప్రభుత్వము; ఇంత చక్కని జాతీయమును తెలిసి కొని యుండుట; జాతీయము ననుసరించి పద్యము నల్లుట; అల్లిన పద్యము నిర్దుష్ట ముగ నుండుట: కావ్యమంతయు నుదాత్తముగ నున్నది.

ఈయనది ఒక విలక్షణమైన బుద్ధి. ఈ వ్యంగ్య కావ్య వస్తువును తీసి కొన్నాడు కనుక నిట్టి కావ్యము రూపము పొందినది. ఒక దెసనుండి చూచినచో ఈయన 'కానుల పురుషోత్తము' వారి వంటి జాతికి చెందినకవి. ఈయన వ్యంగ్య మీదారిని బట్టినది.

దీనికి సాహిత్య అకాడమి 800 రూపాయలు ఇచ్చినదని విన్నాను. అచ్చు ఖర్చంతయు తామే పెట్టుకొని గ్రంథములు కవికీయవచ్చును. లేదా పెట్టుబడి మళ్ళించుకొని లాభములన్నియు కవిగారి కీయవచ్చును. ఈ కావ్యము ఒక విలక్షణ మైన, వినూతనమైన, ఆధునికమైన ఆంధ్రభాషా మహాదేవ్యలంకారము. కాని ఎంత మంచి గ్రంథమైనను తెలుఁగులో నేడు చదివెడి వారి సంఖ్య తక్కువైనది. ఆ గ్రంథము యదృష్టము. వీరు వృద్ధులట. భగవదనుగ్రహప్రాప్తి వీరికి కలుగు గాక!

విజయవాడ
1-6-76

(సం) విశ్వనాథ సత్యనారాయణ

# ప్రవేశిక

**డా॥ దివాకర్ల వేంకటావధానిగారు,** ఎం. ఏ. (ఆనర్సు) పి. హెచ్. డి.
పూర్వాంధ్రాచార్యులు, ఉస్మానియా విశ్వ విద్యాలయము
హైదరాబాదు,

శ్రీ కొర్నెపాటి శేషగిరిరావుగారు రచించిన 'మహా కౌలీన' మను నాలాశ్వాసముల కావ్యము నాద్యంతము పఠించి యానందించితిని. ఇది యొక వ్యంగ్య మహాకావ్యము. ఇందలి వస్తువు తిర్యక్సంబంధియయ్యు పంచతంత్ర హితోపదేశాదులందలి కథలవలె మానవ మానసములకు నొప్పి కలుగకుండ నందలి దుర్వృత్తులను పరోక్షముగా హేళనమొనరించును. కౌలీనమనఁగా పశుపక్ష్యాదుల జగడమనియర్థము, కవిగారన్నట్లు భారతము భారతవీర చరిత్రమును వివరించునట్లే కౌలీనము వీరఖగమృగ చరిత్రమును వెల్లడించును. అంతతోనాగక పశుపక్ష్యాదుల స్వరూపస్వభావములను, తద్ద్వారా మానవుల స్వరూప స్వభావమానస పరిస్థితులను వివరించును. కథావస్తువులను సేకరించుటలోను, పాత్రల నామములను నిర్ణయించుటలోను, వాని చర్యలను వర్ణించుటలోను కవిగారు ప్రదర్శించిన నేర్పసాధారణమైనట్టిది. వారిలోకపరిశీలనమును. తిర్యక్స్వభావ పరిశీలనమును అపారములైనవి. వానికి సహజమైన కవితాప్రతిభతోడై యీ కావ్యమున కపూర్వ వైలక్షణ్యముతోఁ గూడినవన్నె చేకూర్చినవి. కవిగారు రచించిన కావ్యనాటకాదులు పెక్కుకలవు. వాని యన్నింట వ్యంగ్య వైభవము జీవాతువై చెన్నారు చుండును.

ఇందలికథను శుకుఁడు నైమిశారణ్య సమావిష్టులను శౌనకాదులకు జెప్పియుండెను. శుకశౌనకాదులు పురాణప్రసిద్ధులైన మహనీయులు. శుకశబ్దమునకు చిలుక యనియు శౌనక శబ్దమునకు శునకాపత్యమనియు నర్థములు కలవు. పక్షులలోఁ బలుక నేర్చినది చిలుక. పశుపక్ష్యాదులకు సంబంధించిన యీ నవ పురాణము శౌనకాదులకు శుకప్రోక్తమగుట యౌచిత్య శోభితమై యున్నది. కవిగారు కావ్యారంభమున శుకశౌనకులను బ్రవేశపెట్టుట యందే కావ్యస్వభావమును కూడ సూచించియున్నారు. వారు స్వాతంత్ర్య ప్రియులు. భారతదేశస్వాతంత్ర్య

మునకై యథాశక్తిగా త్యాగమొనరించిన దేశభక్తులు. వారి స్వాతంత్ర్యదేశభక్తులు కూడ నీకావ్యమున చక్కఁగా సూచింపఁబడినవి.

ప్రథమాశ్వాసము వాయసజంబుకముల సంవాదము రూపమున బానిసతనమును బరిహసించుచున్నది. లోకమున కొందఱడ్డమైన గడ్డిమేసి, పరుల మోచేతిక్రింది నీరు నాసించి, కష్టనీచజీవనముపుచ్చి, కాలమహిమచేఁదలను గొమ్ములుమొలవ ఘనత్వము పొందుచుందురు. కొందరు సాధువులమని గర్వమువహించి, యితరుల ననాగరికులనియు నడవిమృగములనియు గేలిసేయుచు తామన్యుల పంచఁజేరి కూటి కుండలకును బాడికుండలకును నెసరుపెట్టు చుందురు. కొందఱు మాటలు పాటలు నేర్చి నిరర్థకపు వన్నెల విసనకఱ్ఱలై అన్యుల నకారణముగా నధిక్షేపించు చుందురు. వాయస జంబుకములు తిర్యక్కుల అభ్యాసములను వివరించు మిషచే పైనిచెప్పఁబడిన లక్షణముల కాటపట్టైన నీచమానవులను నిరసించియున్నవి. వాయసము "నరపారతంత్ర్యబీజము వరఖచరులలోన సత్త్వవర్గంబుల నేపఱఁ జేయుట వన్యతనుం గొఱవడఁబోకుండ నిలుపుకొనుట విధి" యని పలికి 'ఖచర సత్త్వములకు నొక్కరణము కల్పించి దానిచే బానిసజాతిని రూపుమాపి కులగౌరవ ములను నిలుపవలె"నని సూచించెను. జంబుకము దేశవాసులెల్లరును దేశీయతను నిల్పఁగడంగునట్లు వననివాసులు వన్యతను నిలఁబెట్టవలెనని యభిప్రాయపడెను. కాకినలుపు, నక్క అవదాతవర్ణము కలది. రంగునుబట్టి వారు కృష్ణార్జునులు. ఈ విషయమునే నక్క కాకితో పల్కిన యీక్రింది పద్యము సూచించుచున్నది.

> ఆనాఁడు సారథిత్వముఁ
> బూని మహాభారతరణమున కాచితి కౌ
> లీనమున విపక్షత న
> న్నీనాఁడు మఱెట్లు కావనెంచితొ సఖుఁడా!

ప్రథమాశ్వాసము నందలి యీ కాక జంబుక సంవాదము రానున్న మహా కౌలీన నాటకమునకు నాంది.

ద్వితీయాశ్వాసము కాక గృధ్ర సంవాదము. ఇందు గృధ్రము మహాభారతము నందలి గృధ్ర జంబుకోపాఖ్యానమును దెల్పి, నక్కవలనఁ దాను బొందిన యోటమిని సూచించి, దానికేదైన ప్రతీకార మాలోచింపుమని కాకిని వేడుకొనెను.

కాకి యది సాకుగ సత్వఖేచర సంతతి కాహవము కల్పించి వనములందెల్ల తద్వ్రహా ద్రుధిర ధారావనధులు పాఱించి నక్కజిత్తుల గ్రక్కించి నిక్కడంచుటకుఁ బ్రతిన పూనెను.

తృతీయాశ్వాసము విహంగమ మహాసభోదంతముతోఁ గూడినది. రామబంధువు గరుత్మంతునికి జరిగిన పరాభవము విని, జంబుకమును ఖగనీతిచే పదభ్రష్టుని గావింప నెంచి, యట్టి ఖగనీతివేత్త యెవ్వరో నిర్ణయింపఁ గోరెను. పక్షులొక్కొక్కటి యొక్కొక్క పక్షిని రాయబారిగాఁ బంపవలెనని పేర్కొనెను. ఒకటి యన్న మాట నింకొకటి సహజ వైరమును బురస్కరించుకొని యధిక్షేపించెను. చివరికి క్రౌంచమును రాయబారిగా పంపవలెనని గరుడుఁడు సూచింప నెల్లరు నంగీకరించిరి. క్రౌంచము రాయబారము జరుప నరిగి మృగరాజుతో జంబుకమును విడువవలెనని చెప్పెను. వ్యాఘ్రోపదేశము ననుసరించి మృగరాజు నక్కగుణగణములెంచి దానిని విడువ నంగీకరింప దయ్యెను. క్రౌంచమా విషయము రామబంధున కెఱింగించెను. యుద్ధ మనివార్య మయ్యెను. ఖగసత్త్వ పక్షములు రెండింట సేనానాయక నిర్ణయ విషయమున వాదోపవాదములు జరిగెను. ఈ సందర్భమున ప్రజాప్రభుత్వము నందలి ఓట్లతోడి యెన్నిక హృద్యముగా వర్ణింపబడినది. చివరికి ఖగపక్షమునకు గరుడుడును, సత్త్వపక్షమునకు జంబుకమును నాయకత్వము వహింపవలెనని నిశ్చయింపబడెను. శీతకాలమున యుద్ధ మారంభింపబడెను.

చతుర్థాశ్వాసము యుద్ధవర్ణనము. కవిగారీ యాశ్వాసమున మృగపక్షి సంగ్రామమును తిక్కన పాండవ కౌరవ మహాసంగ్రామమును వలె సూక్ష్మాతి సూక్ష్మ వివరములతో వర్ణించిరి. "భల్లూక నాయక ప్రబల భీష్మత్వముఁ దొడరు కాకోల విద్రోణతయును........కౌలీన మత్యంత తుములమగుచు రహిఁ జెలంగెను. భారత రణమువోలె" అను సీసమున నా యుద్ధము తీవ్రత విశదీకరింపఁబడినది. మృగపక్షమున మహాభారతమునఁ గౌరవపక్షమున వలె నంతఃకలహము చెలరేఁగెను. తొలుత పక్షుల పక్షమునకే జయమబ్బునట్లు కనిపించెను. తరువాత చీమలు తమ నైపుణ్యమును చూపి పక్షుల నోడింతుమని సింహరాజున కెఱింగించి యాతని నొప్పించెను. సింహము జంబుకమును సేనానాయకత్వము నుండి తొలగించి మార్జాలము నా పదవికి నియోగించెను. మరునాటు యుద్ధము రామరావణ యుద్ధము వలె భయంకరముగా సాగెను. చీమల సాయమున సత్త్వపక్షము విజృంభించి

పక్షులను చీకాకు పఱిచెను. పక్షులు శత్రువుల ధాటికాగలేక సంధికై కాకిని రాయబారిగా పంపెను. రాయబారము ఫలించెను. సింహము శరణాగత త్రాణమున కంగీకరించెను. ఈ ఆశ్వాసమున నవకాశవాదియైన గబ్బిలము పాత్ర అద్భుతముగా వర్ణింపబడినది.

పంచమాశ్వాసమున సింహరాజు సింహాసనస్థుఁడై యుండ జంబుకము వరుసగా నతనికి మృగపక్షి విశేషములను గూర్చియుఁ దద్గుణగణములను గూర్చియు నివేదించెను. ఇచ్చటకూడ కాకజంబుకములు పూర్వజన్మమున కృష్ణార్జునులను ప్రసక్తి కలదు. తరువాత నొక గోవును శకుంతమును మానవులందు కంటె మృగపక్షులందుఁ గల విశిష్టత నెఱింగించెను. పిమ్మట సింహము మృగపక్షులన్నిటికిని హితబోధ కావించెను. అవి విని యవన్నియు మిక్కిలి సంతోషించెను. అనంతరము కొన్ని తీర్మానములు కావింపఁబడెను. ఇందు మానవులందలి దౌష్ట్యము నిరూపింపఁబడినది. చివర మానవుల వశీకరణ శక్తియు, అదియే వారి యాధిక్యమునకుఁ గారణమగుటయుఁ బేర్కొనఁబడినది. వారి నేయే జంతువు లెట్లు బాధింపవలయునో విశదీకరింపఁబడినది. ''మతభేద రజ్జువుల్ కుతుకుల బిలిమి మై ........కార్మ్య మొందించి మనుజులఁ గడపుఁగాత'' మను నాకాంక్షతో నాశ్వాసము ముగిసినది ఈ యాశ్వాసమునందు జంబుకము సింహమునకు పశుపక్ష్యాదుల నివేదించుటయు. తీర్మానములు కావింపఁబడుటయు సరిగా మానవ సభావృత్తాంతమును దలపించుచున్నది.

చివరి ఆశ్వాసము మిక్కిలి చిన్నది; ఇది లొట్టియ దంపతుల పెండ్లితోడను గార్దభములగాన వైభవము తోడను ఆరంభించుచున్నది. ఈ మంగళము జరిగిన పిమ్మట పశు పక్ష్యాదులు తమతమ యిండ్ల కరిగెను. ఒక్క పిల్లి మాత్రము సింహరాజు నాశ్రయించుకొని యుండెను. మృగములన్నియు మార్జాలము వలననే తమకు విజయము లభించెనని దాని ధీ విశేషము నగ్గించి దానిని గురువుగా వరించెను. పిల్లి వానికి వృక్షారోహణము తప్ప మిగిలిన విద్యలన్నియు నేర్పెను. వ్యాఘ్రాదులు చెట్టెక్కు విధము కూడ నేర్పుమని దానిని ప్రార్థించెను, పిల్లి తన యాధిక్యమును నిల్పుకొనుటకై యందు కంగీకరింప దయ్యెను. అంత వ్యాఘ్రాదులు దానిని నిందించి తఱిమి కొట్టిరి, పిల్లి కృతఘ్నము లైనవానిని మనుజులు వేటాడి చంపుదురని శపించి వానితో నుండ నిచ్చింపక తన పరివారముతో మనుజ

సేవ కరిగెను, పులిజాతికిఁ జెందినపిల్లి గహనము నందుండక గృహజంతువగుట కిదే కారణమని కవిగారి నిరూపణము. ప్రయోజనముండు నంతవఱకు నితరుల సేవించి యది ముగిసిన తరువాత వారిని నిందించి కృతఘ్నత ప్రకటించు నీచుల సహజ స్వభావమిందు ప్రకటీకరింపబడినది.

ఈ కావ్య మాంధ్ర వాఙ్మయమునకపు రూపమైనది. అందు ద్వ్యర్థిత్ర్యర్థి కావ్యములున్నవి కాని ఆద్యంతమిట్లు వ్యంగ్య వైభవముతోఁ గూడి అన్యాప దేశముగ మానవ స్వభావాచార సంప్రదాయములను హేళనచేయు కావ్య ములొండు రెండుకంటె నెక్కువలేవు. కవిగారిందు తిర్యక్కులయందు మానవత్వము నారోపించి తచ్చేష్టా సంభాషణాదులచే మానవులందలి దౌష్ట్యమును నిరూపించి పరోక్షముగ శక్తిమంతమైన యుపదేశము నొసంగి యుండిరి. ఈ యుపదేశ విధానము నిశితమును అమోఘమునై నట్టిది. "పరస్య హృదయంభిత్త్వా(న) ధూనయతియచ్ఛిరః" అను మహాకావ్యలక్షణ మిందు సమ గ్రము గాన న్వయించును. కవిగారు సర్వతిర్యక్కుల స్వరూప స్వభావ చేష్టాదుల తీరు పరిశీలించిన విధము శ్లాఘాలంఘన జాంఘికమై యచ్చెరువు కలిగింపక మానదు. మానవులు రాజకీయాదులందవలంబించు సంప్రదాయములను గూడవారు చక్కగా పరిశీలించి అన్యాపదేశముగ నెకసక్కెము చేసినారు. భట్టుమూర్తినదీ పర్వతములందు నాయికా నాయకత్వముల నారోపించి చేసిన వర్ణనమున నెంతధీ పాటవ మున్నదో అంతధీపాటవ మీ కావ్యమున నాద్యంతము గోచరించి పఠితల నుఱ్ఱూఁత లూగించును.

చతుర్థాశ్వాసము యుద్ధవర్ణనమయము. ఇందుకవిగారు యోధుల యెక్కటి యుద్ధమును, ద్వంద్వయుద్ధమును, సంకులసమరమును, వ్యూహనిర్మాణమును, సాంగ్రామికనీతిని, యోధుల సంభాషణోపాలంభములను చక్కగా వర్ణించి యున్నారు. వారిందు ప్రదర్శించిన నైపుణ్యమనన్య సాధారణమైనది. వట్టి కాలీనమును వారు కురుక్షేత్ర రామరావణ యుద్ధములతో సమానప్రతిపత్తి కలదానిని గా నిరూపించినారు. సంధివిగ్రహతంత్రములను నడపించుటలోవారు ప్రదర్శించిన నేర్పు వర్ణనాతీతము.

ఇందలి ప్రధానరసము వీరము. యుద్ధవర్ణన సందర్భమున రౌద్రక్రోధములు కూడ కనవచ్చును. గృధ్రము కాకముతో తన యోటమి చెప్పుకొను సందర్భమున కరుణమున్నది. షష్ఠాశ్వాసమున లొట్టియ దంపతుల వివాహమును గార్ధభముల

పాటకచ్ఛేరియు వర్ణించుపట్ల హాస్యమున్నది. తిర్యగ్గతమైనరసమున కాభాసత్వ మంటకుండ నిర్వహించుటలో కవిగారు చూపిన కౌశలమ నన్య సాధ్యమైనట్టిది.

కవిగారి వర్ణనములు సహజసుందరములై యొప్పారుచున్నవి. యుద్ధవర్ణనము నందును, తిర్యక్స్వభావ చేష్టాదుల వర్ణనమందును వారు ప్రదర్శించిన ప్రతిభయిది వరకు చెప్పఁబడినది. కావ్యము గ్రీష్మవర్ణనముతో నారంభించుచున్నది. ద్వితీయాశ్వాసారంభమందలి వానకారు వర్ణనమును, చతుర్థాశ్వాసము మొదటఁగల హేమంత వర్ణనమును నిసర్గసుందరములై కవిగారి ప్రకృతి పరిశీలనమును బ్రకటించుచున్నవి. పంచమాశ్వాసము మొదట కేసరి నిండుకొలువు తీర్చిన వర్ణనమున్నది. "గంధగజ మభిషేకంబుగావించెను·....." ఇత్యాదిపద్యము లెంతో యౌచిత్యశోభితములై సహృదయహృదయా వర్జకములుగా నున్నవి. ఇచ్చటి పదప్రయోగ నైపుణ్యమును శ్లాఘించుటకు మాటలు చాలవు. ప్రథమాశ్వాసము మొదటఁగల కృష్ణార్జునాభిఖ్యములగు కాకజంబుకముల నెలవుల వర్ణనము ప్రశంసాపాత్రము. కవిగారెడనెడ సూర్యచంద్రోదయాదులు వర్ణించిరి. మహాభారత యుద్ధమువలె నీ కౌలీనమును ఆసూర్యోదయాస్తమయముగ జరిగినది. "ఒక్కపగలున్ రేయున్" అని భారతయుద్ధమైన చివర రాత్రిజరిగినది. కాని యిందట్టి యధర్మము జరిగి యుండలేదు, మానవులకంటె తిర్యక్కులెక్కువ ధర్మపరాయణములుకదా. చతుర్థాశ్వాసమున ద్విజరాజోదయము వర్ణితమైనది. "ద్విజులఁబఱచినపాట్లను దెలిసియేమొ" అను పద్యమున చంద్రోదయారంభమందలి యెఱ్ఱదనమునకును తరువాత చంద్రునికిఁగలిగిన ధావళ్య శైత్యములకును కారణము చక్కగా చెప్పఁబడినది. ఇట్టి ప్రకృతి వర్ణనములను కవిగారు కథా సంబద్ధములు చేయుట వారికి సోమయాజి వర్ణనములందుఁగల అభిమానమునకుఁ దార్కాణము,

ఈ కావ్యమున తిర్యక్కులు కావించిన సంభాషణములను కవిగారత్యంత హృద్యములుగా తీర్చిదిద్ది యుండిరి. సేనానాయక నిర్ణయ సందర్భమున నొకరొక్కరిని పేర్కొన వేరొకరు నిషేధించుచుందురు. ఆనిషేధమునకై వారు చూపు హేతువు లెంతో సహజములును సరసములునై యుండును. ఇందుకుదాహరణము లీయ నవసరములేదు. తృతీయా శ్వాసమంతయు నిందుకు చక్కని విదర్శనము. అట్లే కృష్ణార్జునుల సంభాషణము, కాకగృధ్రముల సంభాషణము, క్రౌంచకాకముల రాయబారములు మహాద్భుతములుగా నున్నవి.

కవిగారీ కావ్యము ద్వారా మానవుల కందిచ్చిన యుపదేశమన్యాప దేశకృత మయ్యు సర్వజన శిరోధార్యమైనట్టిది. ప్రథమాశ్వాసమున బానిసతనము నైచ్యమును, ద్వితీయాశ్వాసమున నవమానముయొక్క వ్రేగును. తృతీయాశ్వాసమున జీవుల కొండొరుల యెడనుండు రాగద్వేషములును నాత్మయందుఁగల మమత్వాభిమానములును, చతుర్థాశ్వాసమున యుద్ధతంత్రనైశిత్యమును యుద్ధము వలని కీడ్పును, పంచమాశ్వాసమున మానవుల స్వార్థపరతా దౌష్ట్యములును, షష్ఠాశ్వాసమున కృతఘ్నతా లక్షణమును చక్కగా నిరూపింపఁబడినవి. సింహరాజు పంచమాశ్వాసమున జంతువుల కొనరించిన హితబోధ మానవులకుఁ గూడననుసరణీయమైనట్టిది. ఈ కావ్యమున తిర్యక్కులందలి మానవత్వమును మానవులందలి పశుత్వమును రమ్యముగా నిరూపింపబడినవి. కవిగారు సృష్టించిన గబ్బిలము పాత్ర గమనింపతగినది. అది పక్షియుఁగాదు మృగమునుకాదు. ఏపక్షమునుగాని స్థిరముగా నవలంబింపక యది యుభయభ్రష్టతనంది పశ్చాత్తాపమునకు గురియైనది. ఈ గబ్బిలమును జూచి అవకాశవాదుల ఏవద్య మార్గము నలవఱచుకొనవలయును.

ఇంక నీ కావ్యమునందలి పదప్రయోగ శ్లేష సంఘటన నైపుణ్యమును గూర్చి రెండు మాటలు చెప్పి విరమింతును. హంస, సారస, కలకంఠ, కృష్ణార్జునాది పదములను కవిగారు వాడిన విధమునందలి సౌందర్య మనిర్వచనీయము. అట్టి సౌందర్యము కావ్యము నందాత్యంతము గోచరించును. ఒక్క పద్యమును మాత్ర ముదాహరింతును. పంచమాశ్వాసమున జంబుకము రాజునకు భృంగరాజుం జూపి "ఇదిగో వీరిం జూడుము. అల్ప వ్యక్తులయ్యు ననల్ప గుణాన్వితులు రసజ్ఞ శిఖామణులు

> కాంచనాశా విరహితుఁడుగా జెలంగి
> సర్వసుమనోఽనురంజన సరణి మిగిలి
> శ్రీసదాలయమైన కుశేశయమున
> పట్టు మధువ్రతోన్నతి నుండు భవ్యుఁడీతఁడు.

అని చెప్పెను. ఇందలి కాంచన, సుమనః, శ్రీ, మధువ్రత శబ్దముల ప్రయోగమునఁ గవిగారు చూపిన నేర్పు భట్టుమూర్తికిని, చేమకూరవానికిని మాత్రమే సాధ్యమైనట్టిది. ఇట్టివి కావ్యమున నసంఖ్యాకములు. "రామ మృగేంద్ర విక్రాంత్యా

రామత లక్ష్మణ సముదగ్రలక్ష్మణతయు'' మున్నగు పద్యములు కవిగారి సహజ పాండిత్యమున కుదాహరణములు. రాయబారిగా వచ్చిన కాకిని గూర్చి వ్యాఘ్రము ''కావుకావను పలుగాకిగాని యితఁడు చేకొనందగు మృగరాజ సింహమునకు'' అని పల్కుటలోని యౌచిత్యము సర్వసుబోధము. ''కలకంఠ మధురకంఠీ! కలహంస నిభప్రశ స్తగమన! మయూరీలలిత శుభాంగియని మనుజులు జాణలగు సతులఁ బిలుచు కొనెదరుగదా!'' అను పద్యమునందలి యుపమానములు పక్షులు. ఉపమానములుపమేయముల కంటె గుణాధికములగుటలో సందేహముండదు కదా? కంఠీరవ, పుంగవ, నాగ, కుంజర, శార్దూలాది పదములు మానవులయెడ ప్రయుక్తములై శ్రేష్ఠత్వమును సూచించును. రాజనీతి మానవ నీతులకు బదులు మృగవినీతియనియు జనాంతిక మనుటకు మృగాంతికమనియు కవిగారు ప్రయోగించుట వారి ఉపజ్ఞకు నిదర్శనములు. వారిందెన్నో లోకోక్తులు, సామెతలు, జాతీయములు వాడియున్నారు. వారి పద్యములు ధరాళగమనశోభితములై, సులభములయ్యు శక్తిమంతములై, శ్లిష్టములయ్యు సర్వసుబోధములై, నిర్దుష్టములై చమత్కార భాసురములై యొప్పారుచున్నవి. వారు చాలకావ్యములు వ్రాసియుండిరని వింటిని, అవి యన్నియు త్వరలో, ప్రకటితములగుచో నాంధ్ర సారస్వతమున కెనలేని యలంకారములగునని భావించుచున్నాను,

హైదరాబాదు
14-5-76

(సం) దివాకర్ల వేంకటావధాని

ఉభయభాషా ప్రవీణ, వేదాంత పారీణ
కవిశేఖర, విద్యానాథ, కవితామహేశ్వర,

# శ్రీ మిన్నికంటి గురునాథ శర్మగారు

గుంటూరు-2
బ్రాడీపేట 5/15
20-5-1976

శ్రీ కొరెన్నిపాటి శేషగిరిరావు గారు తాము రచించిన మహాకాలీనమును చదివి విన్పింపఁగా విని ఆనందించితి. ఈ గ్రంథము చాల గంభీరార్థ గుంభిత మైనది. రచన మాశ్చర్య జనకముగా నున్నది కవిగారికిఁ బూర్వపుణ్య సంస్కార వశమునఁ జక్కని కవిత తోడఁబుట్టినది. ఆమె గుణవంతురాలు. సువర్ణాలంకృత, శయ్యాసౌభాగ్యము పాకనైపుణి గలది, శుభలక్షణములుగల తేటగీతలు గలది. ఎవ్వరైనఁ గష్టపడి యభ్యాసవశమునఁ బాండిత్యమును సంపాదించు కొనఁగలరుగాని కవిత్వమును సంపాదించుకొనలేరు. సహజమైన కవితలో నకుంఠితధార యుండును. ధారాశుద్ధి గల కవితకు ప్రతిభతోడైన మహాకాలీనము లంకురించుటలో వింత యేమున్నది? "ప్రతిభా వ్యుత్పత్త్యోః ప్రతిభా శ్రేయసీ" అని ఆనందవర్ధనుఁడెందు కన్నాఁడు? ప్రతిభ యున్నచో తిమ్మిని బమ్మిని, బమ్మిని తిమ్మి చేయవచ్చును.

> "రమ్యం జుగుప్సిత; ముదార మథాఽపినీచం
> ఉగ్రం ప్రసాది; గహనం వికృతంచ; వస్తు
> యద్వాప్యవస్తు; కవిభావక భావ్యమానం
> తన్నాస్తి యన్న రసభావముపైతి లోకే (దశ)

చక్కనిది కానీ, కాకపోనీ, కొద్దిదిగానీ, గొప్పదికానీ, భయంకరమైనది గానీ, ప్రసన్నమైనది గానీ, గంభీరమైనదిగానీ, వికారమైనది గానీ, వస్తువుగాని అవస్తువు గానీ, కవిరత్నముచే భావ్యమానమై రసభావములఁ గల్గించి రసికులఁ దనియించును. కాన మనకవిగారు పనికిమాలిన జంతువులను దీసికొని పనికివచ్చునట్లు చేసినారు. "విద్యా విహీనః పశుః" అని మనుష్యుల కంటెఁ బశువులు హీనములని మనవారి తలంపు. గాన వానిని మన కవిగారు కథాపాత్రలం జేసి రంగమున కెక్కించి యా

తలంపు తప్పని నిరూపించిరి. ఇంతకుముం దేయిద్దరు సుగ్గురో తప్ప (కందుకూరి వీరేశలింగము పంతులుగారు, మధిర సుబ్బన్న దీక్షితులుగారు) ఎల్లరు పురాణముల పుక్కిలించిరి. ఇతిహాసముల నెత్తుకొనిరి. నాటకముల నమలిరి. కావ్యముల కద లించిరి, కాని నోరులేనివని కాంబోలు మృగపక్ష్యాదుల జోలికి పోలేదు. సంస్కృతమును విష్ణుశర్మ పంచతంత్రమునను నారాయణకవి హితోపదేశమునను ఈ మృగపక్ష్యాదుల పాత్రలుగా చేసి అన్యాపదేశముగా హితోపదేశ మొనర్చిరి. నవనవోన్మేషశాలినియగు ప్రజ్ఞయున్న ఎంతపనినైనం జేయవచ్చును.

' భావా నచేతనానపి – చేతనవత్, చేతనాన్య చేతనవత్

వ్యవహారయతి యథేష్టం - సుకవిః కావ్యే స్వతంత్రతయా''

కనుకనే ప్రజ్ఞాశాలియగు మన కవి నేలంబాఱాడు చీమలచే నింగిం దారాడు పక్షులను జయింపంజేసినాడు. కవి యెక్కడ సేకరించెనో పిపీలికా శాస్త్రముం జదివి యాక ళించుకొని యట్లు వ్రాసెనుగాని యవి యూహా కల్పితములు గావు. మన మెఱుగముగాని చీమల చరిత్ర చాలంగలదట. కైకేయి తండ్రి చీమ పల్కిన మాట విని నవ్వెను. ''పైడి చాయయై కొఱలెడి చీమపల్కినకు గొల్లున నవ్వె నృపాలుం డంతటన్'' అని వాసుదాసుగారు వ్యాఖ్యానుసారముగా వ్రాసిరి.

వాల్మీకి : పితు స్తే వరదః కశ్చి – ద్దదౌవరమనుత్తమం

సర్వభూతరుతం తస్మాత్ – సంజజ్ఞే వసుధాధిపః

తేన తిర్యగ్గతానాంచ – భూతానాం విదితం వచః. (అయోధ్య 35–17)
అని తిర్యక్కులకును భాషయున్నట్లు వ్రాసెను.

కవిగారేదో పురాణము నుండియేదో ఒకకథను దీసికొని గ్రంథము వ్రాయక యిట్టి క్లిష్ట సమస్య నెందుకెత్తుకొన్నారో యని యడుగవచ్చు. నిజమే ఇట్టి గ్రంథమును వ్రాయుట కొకలోకశాస్త్రాద్య వేక్షణము చాలదు. గ్రామ్యపశుపక్షులయు నారణ్యక మృగ పక్షులయు స్వభావములు ప్రవర్తనములు అలవాట్లు మున్నగు విషయము లెల్ల కూలంకషముగాం దెలిసియుండవలయును. అందులకొక్క యింద్రియార్థ సన్నివేశము చాలదు. దుర్లభములైన యాయాశాస్త్ర గ్రంథముల సేకరించి

పతించి సమన్వయి చుకొనవలసి యుండును. కవిగారట్లొనర్చియే యీ గ్రంథమును వ్రాసిరి. ఎందుకన—

కవిగారు భారత స్వాతంత్ర్య యుద్ధమున నంతో యింతో పాల్గొనక పోలేదు. ఆయన అత్యంత స్వాతంత్ర్య ప్రియుఁడు. పరదాస్యము నెంతమాత్రము సహింపలేఁడు. 1947 ఆగస్టు 15 నాడు

క. ॥ పరమావధి యిది యగునా?

భరతకుమారుండు నిద్ర పడ యెందగునా?

పరిపూర్ణ స్వాతంత్ర్యము

స్వారాజ్య పదమందిఁ బొంది భాసిలు దనుకన్'' (తెలుఁగు వెలుఁగు)

అనిగర్జించినాఁడు. అంత భావావేశము గల వీరానాడు భారత స్వాతంత్ర్య మార్గమున కడ్డుతగులుచున్న వారిని జూచి సహింపలేక పోయినారు. ఆ ఆవేశమును లోలోన నిమిడించు కొనలేఁడు. యథార్థరూపమున బయటికి వెళ్ళఁగ్రక్కలేఁడు, అప్పుడీ పశువుల మీఁదఁబెట్టి తన అక్కసు తీర్చుకొన్నాడు.

ఈ కావ్యమున చిత్ర విచిత్రములైన పాత్రలు మీ మనో నేత్రముల ముందు గాత్రములు త్రిప్పుచు నాడు చుండును. వారు మృగపక్షుల రూపమున నున్న మనుష్యులని మాత్రము మఱవకుఁడు మీకుఁదెలియకుండనే మీ మొగములు వికసించును. ఇఁక మంత్రినెన్నుకొనుట సేనానాయకు నెన్నుకొనుట రాయబారి నెన్నుకొనుట మున్నగు విషయములే యేవ్యక్తులకుఁ జెందునో చదువరులూహించుకొనుట లెస్స

కాక జంబుకములకును వర్ణానుకూలముగా కృష్ణార్జుననామము లందగిలించి వానివలె వీరును భూభారము వాపిరనిరి, ఎట్లో చదివిన మీకే తెలియును.

ఇఁక రచనలో స్వభావోక్తులు కోకొల్లలు. తెలుఁగుఁబలుకుఁబళ్ళు క్షణక్షణికోదయాలు. శ్లేషాశ్లేషములు స్వయంగ్రాహములు. పాత్రలలో తన్మయత చెంది వ్రాయునవు, డనుప్రాసా, లసంఖ్యాకాలు. కావ్యత్వమును సంతరించుటకుఁగాఁ

బోలు గ్రీష్మ, వర్ష, హేమంతఋతువర్ణనలు, సూర్యోదయాస్తమయ వర్ణనలుం గలవు. 2వ ఆశ్వాసమున అర్ధనారీశ్వరవర్ణన అలంకార యుక్తమై అందముగా నున్నది.

నెలకు నూఱురూపాయల చొప్పున పారితోషికమిచ్చుచు రాష్ట్రప్రభుత్వము వారును, గ్రంథమచ్చువేయించుచు ఆంధ్రసాహిత్య ఎకాడమివారును శ్రీ శేషగిరిరావు గారిని గౌరవించుచుండ నిపుడు నేను వారు మంచి పండితులని చక్కని కవులని వ్రాసిన పునరుక్తి దోషము నాకంటదా? ఇవి వేదాంత వాక్యములు నమలు చుండెడి యెనుబదియేండ్ల వృద్ధుని మాటలు ఈమ్.

(సం.) మిన్నికంటి గురునాథశర్మ.

ప్రొఫెసర్ డా॥ యస్వీ జోగారావుగారు
ఎం. ఏ. పిహెచ్. డి.
ఆంధ్రవిశ్వవిద్యాలయము
వాల్తేరు

# అభిసంధి

'కవిరత్న' శ్రీ కొర్నెపాటి శేషగిరిరాయల "మహాకాలీనము" యుగపురుషుడు వీరేశలింగము పంతులుగారి "మహారణ్యపురాధిపత్యము", "తిర్యగ్విద్వన్మహాసభ" మున్నగు కృతులందు సుప్రతిష్ఠితమైన వక్రోక్తి వ్యక్తీకరణ శక్తికి శాణోపలమైన ప్రజ్ఞకు ఉపజ్ఞకు చక్కని సాహిత్య ఫక్కికకు నిదానముగా నిలుచునట్టిదైనను అద్యతనాంధ్ర వాఙ్మయమున ఒక అపూర్వ సృష్టియనక తప్పదు

యుగధర్మ స్వరూప నిరూపణముతో విగుర్వించిన యితివృత్తము, బహుముఖ వికస్వర శీలమైన భావసంపద, లోకజ్ఞతను లోగొన్న రసజ్ఞత, ఉజ్జ్వలమైన ఊహాశాలిత, చమత్కారచారువైన వ్యంగ్య వైదగ్ధ్యము, బంధురమైన రచన ఈ కావ్యము నగ్రశ్రేణికి చేర్చుచున్నవి. సాధు సాధు.

గుంటూరు,
17.6.1976

(సం) యస్వీ జోగారావు

# హృదయాహ్లాదము

చిన్ననాఁటను రచియించియున్న కావ్య
మిన్ని నాళులు వెనుబడి యున్ననైన
వెన్ననగు వారి సన్నిధి మన్ననంది
యున్నతింగను చిన్నెలగన్నదయ్యె ।

విశ్వనాథ దివాకర వీక్షణంబు
మిన్నకంటి గుర్నాథ సమీక్షణంబు
జోగిరాజ శిఖామణి స్వాగతంబు
నంది మత్కృతి కాంత కృతార్థయయ్యె ।

ఇట్లు
గ్రంథకర్త.

# మహాకాళీనము

## ప్రథమాశ్వాసము

మొదలుం దుదయును లేకయె,
విదితంబగు రూపు లేక, విరివియు లేకే,
అది యిది యనఁగా రాకయె
పొదలిన తత్త్వంబు నేను బుద్ధిం దలఁతున్.

లేమియుఁ గలిమియుఁ గాకయె
ఈ మహి సర్వంబు దానుగానయు, యెదియుం
గామింప, కేదియు నీయక
తామసమును తేజమయిన తత్త్వము వలతున్.

నిరుపమము, నిర్గుణంబును,
పరిపూర్ణము, నిర్మలంబుఁ, బరమార్థంబున్,
నిరవధియు, న్నిరవద్యము,
నిరామయము తత్త్వమేను నిరతముఁ గొలుతున్.

పదువురి మేలు గోరి కడు భారము నూనుచు, నాడుబిడ్డయై
పదువురి నోట నానుచును, పాపమదేమనఁ దాటి యాతలం
బదునవు మక్కు గంటములఁ బల్మరు నొక్కులు పొంది పొంది, యీ
యదనున వచ్చు నొత్తఁబడు నా వలుకుం జెలువం దలంచెదన్.

సాగనియజ్జ, ప్రేలఁ బడసాగిన యందదుకైన బొజ్జయున్
సాగఁగ, భూప్రదక్షిణము సల్పుచు, విద్దెలకెల్ల నొజ్జయై,
వ్రేగగు నేగ్గు శీర్షమున వ్రేలెడి తొండము తోడఁ గ్రుంగుచున్
వీఁగక విద్దెలం గఱపు వేల్పు గణాధిపు నే భజించెదన్.

తొల్లి [1] బాదరాయణుండగు [2] శుకుండు నైమిశారణ్య సమావిష్టులగు [3] శౌనకాదులకుఁ బుక్కిటి పురాణంబులం బల్కి కర్ణపర్వం బొనర్చు నెడఁ "పారతంత్ర్యంబు బహు జన్మాంతరసంచిత పాపమూలంబన విందుము. అయ్యది యింకను మనవారిఁ గొందఱ విడువక పట్టిపల్లార్చి, జాచి, బంపమునం బెట్టుచున్నది. ఇట్టి మహాపిశాచి పాతం బడనీక తరణోపాయ కారణంబగు మహాపురాణ శ్రవణంబున మమ్ముం గృతార్థులం బొనర్పు" మన, రాగ వికసిత ముఖాబ్జుండై, శుకుండు వారల కిట్లనియె. "మీ యడిగిన యర్థంబు పరమార్థంబు. తదర్థంబై మున్ను మనవారు "మహాకౌలీనం" బొనర్చి కులంబు నుద్ధరించిరి. కాని కలి సమాగతంబై తిరుగ నా పారతంత్ర్యంబు తలసూపం దొడంగె. ఏతన్మహా పురాణ శ్రవణంబునఁ గలి హరణంబును, పారతంత్ర్య నిర్మూలనంబునగు. కాన సావధానులరై యాకర్ణింపుఁ"డని వచింపందొడంగె.

భారత వీర చరిత్రము
పారము ముట్టంగఁ బలుకు "భారత"మటులన్
వీర ఖగ మృగ చరిత్రము
వారక "కౌలీన" మెఱుఁగ పఱచు ధరిత్రిన్.

---

[1] రేగుటడవులఁ జరించువాఁడు, [2] చిలుక, [3] కుక్కజాతి జంతువులు (నక్కలు, తోడేళ్లు మున్నగునవి).

## కథాప్రారంభము:

ధగ ధగ ద్ధగలచేఁ దనరి మరీచికల్
మోగి జలభ్రమ మృగంబులకుఁ గొలుప
నిగ నిగ న్నిగలచే నెగడి యభ్రకశిలల్
మిగులఁ గన్నుల మిఱుమిట్లు గొలుప
బగ బగ సెగలతో బలువైన వడగాడ్పు
బాటల దుమ్ము తూర్పారఁ బట్ట
భుగ భుగ జ్వాలలఁ బొలుపారి కార్చిచ్చు
నిప్పుకల్ చెలరేఁగి నింగి ముట్ట

చండ భాస్కర కర సహస్ర ప్రసార
దుస్తర దురంత దుర్దాంత విస్తరముగ
మండె మలమల బ్రహ్మాండ భాండమెల్ల
భీష్మ తాపా తపాఖిల గ్రీష్మవేళ.

## నక్కబావ - కాకిబావ

అట్టియెడ, నొక్కయెడ——

మొగిలు చందంబున మునుకొని జొంపమై
రహిఁ జల్వ చీఁకటి ప్రాఁకు గూర్ప
బూఁ బొదరింటిలో భూ బిలాంతరమున
నునుపారు తిన్నియ నసల పాన్పు
నందు హాయిగ నర్జునాఖ్య ఫేరవ పతి
శయనించి యుండ విశ్రాంతముగను,
నా విలాస గృహంబునందు ప్రేలెడి తీగ
తూఁగుటుయ్యేలలోన నూగు చుండె

కృష్ణ సదభిఖ్య నొప్పు కాకియు నొకండు,
బావ మఱఁదుల వావి యవ్వారలకును
జన్మ జన్మాంతరంబుల జరుగునట్లు
పలుకు కొనుచుండ్రు వారలవ్వారిగాఁగ.

కుశల సంప్రశ్న మొనరించి కొంత తడవు
మాట వరుసను నేదియో మాట వచ్చి
పారతంత్ర్యంబు నిందించి పలుకఁ దొడఁగె.
బానిసీంద్రగు తమ జాతివారి నక్క.

అబ్బబ్బా! ఏమి చెప్పుదు! గృహాసక్తంబులగు ఛేకంబుల యుద్రేకంబు పట్ట పగ్గంబులు లేకున్నది.

అడ్డమైన గడ్డినిమేసి, యా మనుష్య
మాత్రులకు లొంగి, పరుల మోఁచేతిక్రింద
నీరు నాసించి, మెడపైని కాడి వేసి,
తోఁక మెలపైచి, ములుగఱ్ఱతో నదల్చి,
మోదిన న్నోరు మెదలుపంబోక యుస్లె
గ్రుడ్ల నీరును గ్రుడ్లను గ్రుక్కికొనుచు
బండి లాగెడి వడువున, దండి కంప
తోడుగు నీడ్చు తెఱంగున దుర్భరముగఁ
గాలమును వెళ్ళఁబుచ్చెడి కష్ట జీవ
ములు, పశుప్రాయము లహా! కొమ్ములు గోరిజల్లి
గలిగి ఘనులైరి నేఁటికిఁ గాలమహిమ.

"ఆహా! తెలిసినది. వచ్చిగడ్డి మేయు బసవన్నల మాటయా!" అని వాకొను కాకము నాలోకించి వంచకంబు మఱియు నిట్లు పలుకం దొడంగె—

రౌతు పై నెక్కి కళ్ళెంబు వాతఁ బెట్టి,
జుట్టు నంది పుచ్చుకొని, దాఁ జుఱ్ఱుమనఁగ
కొఱడతో వీఁపు ప్రేలఁగఁ గొట్టు చుండఁ,
జెవులు ప్రేలుకాడఁగ నేమి చేయ లేక
ఎడ్డె సకిలింపుతోఁ బరువెత్తు వారు
కాళ్ళు గలవారలై రి యిక్కాలమునకు.

అనుటయు (గాకి "దిక్కు మాలిన బక్కజక్కులా!" యని వక్కాణింప నక్క వెండియు నిట్లనియె—

ఒక్క మనుజుఁడు వీఁపుపై నెక్కి త్రొక్కి
అంకుశంబున వేసియు నడఁచి పట్ట
నెత్తిపై నోరు నిడుకొని మొత్తికొనుచుఁ
ద్రోవఁదీయువారు మహానుభావులై రి.

ఇట్లు పలుకు నక్క పలుకులకు కాకి "ఊసు చేతి మొరటు కరటియా!" యని వ్యాఖ్యానింప జంబుకంబు తన ప్రసంగం బిట్లు సాగించె—

సాధువులమని దుర్గర్వ సహితులగుచు
అంకెలను వేసి సకిలించి బింకముగను

చెపుడు గొలుపంగ గీపెట్టి చెప్పుచుందు
రడవి మృగములమని మమ్ము నపహసించి,

ఘాతుక మృగములమని, న క్తంచరుల మ
నియు, దయాశూన్యులమనియు, నిందు ప్రాణ
ములను దీయుదుమని, నరభోజనుల మ
నియు. నడవి జంతువులమని నిరసనమున.

మంచిగా నుండి మనుజుల పంచఁ జేరి
కూటి కుండలకును, పాఁడి కుండలకును
నెసరు పెట్టెడి వాడు గావించు నట్టి
యా యధిక్షేపణములకు హద్దులేదు.

అనుటయు వాయసంబు "బానిస కుక్కలు, బడుగు పిల్లులా! కుక్కలు మొఱిగిన మృగజాతి మర్యాద కొఱత వడునె?" యని సాభిమానముగాఁ బలికిన, మరల నక్క వక్కాణింప సాగె—

వారలే భువి విశ్వాస పాత్రులంట
తిన్నయింటిని విడువక తిరుగుదురఁట
దాతపేరు మఱవని కృతజ్ఞులంట
వార వల్కు దీర్ఘాలకు మేరలేదు.

బానిసలుగాఁగ గర్హింపఁబడుటఁ గనక
నాగరికులము మేము మానవుల గోష్ఠి
నుందుమని గర్వమునఁ గూయుచుందు రహహ!
వారియజ్ఞాన మేమన వచ్చునింక?

గ్రామసింహములని తమ్ముఁ గడకఁ బిలువఁ
దోఁక నులుముకొనుచు వారితోఁ జనెదరు;
తలఁపరెంతయు వా రెగతాళిగాఁగ;
బానిసతనంబు జితియించె మానసముల.

జ్ఞానవంతులరైన మానవుల సేవ
ధన్యతను గాంతుమని వారు తలఁచుచుంద్రు;
పాప మనక స్వజాతులం బట్టి యిచ్చి
వారల యనుగ్రహ ప్రాప్తి వరలుచుంద్రు.

స్వేచ్ఛ మఱచిరి; యభిమాన చిహ్నమేమి
కానఁబడ దిప్డు; పశువుల కరణి నైరి;
వారు మనవారలనుకొన్నఁ బరువు వోవు;
వారి కొదవ దీఁకఁ దరణోపాయ మేమి.

నెలవుగ దాలిగుంట శయనించిన వేళల "నొండ్ల యిండ్ల లో
పలికిని బోవ నేల ? మఱి వారలచేఁ బ్రహరింప వౌచు నీ
వలఁ బడి తోఁక ముడ్చుకొని పాఱఁగ నేల ?" యటంచు నెమ్మదిం
దలఁచును ; లేచి, దేహము విదల్చిన యంతనె బుద్ధి మారెడిన్.

ఇట్టి చపలబుద్ధి యిది కుక్కఁ గాకున్నఁ
బరుల పంచలేలఁ బట్టి యుండుఁ?
బుడమి దొరలుచుఁ దన కడుపు కాళ్ళను చూపి
పట్టె దన్నమునకుఁ బాటుపడునె ?

కులము గొప్ప యేమి! కొదలేని సాధన
సంపదలను పొదలు చంద మేమి!
వెట్టి రేని పోక నిలుచునే పరు నింట ?
గండుతన మదెల్ల బెండు వాఱె !

నక్క మాటలకు నక్కాకంబు వెక్క సంపడి, "పిల్లి గాదిది, పిశాచము." అని నిట్టూర్పు పుచ్చె. వెండియు వంచక మిట్లువాక్రుచ్చె—

సాహసంబున స్వేచ్ఛగాఁ జనుట మఱచి
చుంచులను, లాఁగడాగుళ్ళఁ, జూరెలుకలఁ
గొక్కులను జంపు దీక్షఁ గైకొని చరించు.
దేశసేవ యొనర్చుట తీరఁటయ్య ?
వననివాసికి వనసేవ పాడు వఱచి

దేశవాసు లెల్ల దేశీయతను నిల్పఁ
బాటుపడు టెఱింగి భావమందు
వననివాసు లైన వారము మన మెల్ల
వన్యతను దలిర్ప వలయుఁ గాదె?

అని వచించిన,

వాయసము సఖుని పలుకుల
నోయన విని, "యింట నింట నొక ప్రొయ్యి సరే
మా యింట మఱొక్కటి" యను
న్యాయంబున నుంటి మేము" నని మాటాడున్.

కలసియు మెలసియు నుండెడి
పులుఁగులలో నిపుడు పెక్కు పొరపులు పుట్టెం
"జిలుక గొరువంక పోరుగఁ"
జలమున నొకరొకరిఁ బట్టి సాధింతురిలన్.

లోకోపకార మేమియు
లేకున్నను, వన్నె చిన్నె లీలల నీకల్
తోఁకలు జోకలు గలవై
యాకసమున కెగసి పడుదు రటు కొందరిలన్.

అనుటయు నక్క, "వహ్వా! నిరర్థకపు వన్నెల విసనకఱ్ఱల విషయమేనా?" యని యవహసించుటయు, వాయసం బిట్లు వాకొనం దొడంగె—

మాటలు నేర్చితిమనుచును
పాటలు పాడుదుమటంచుఁ బటుతరముగ మే
మాటల నాడుదు మనుచును
గోటును జూపెదరు వారు కొంత యుదటునన్,

తమ్ము సాఁకినవారి సంతానములను
కాకులను జేసియును, తాము కోకిలంబు
లనఁ బడుటయె ప్రఖ్యాతిగ నాత్మఁ దలచి
యెగిరిపడు కృతఘ్నులను సహింపఁ దగునె?

ఘనమైన నడవడి గలదని యొక్కఁడు
కాళ్ళు మొగం బెట్టిగాఁ జరించుఁ
బలుకు మాధుర్యంబు గలదని యొక్కఁడు
మాటమాటకు మారు మాట వలుకుఁ
బాట సౌలభ్యంబు పాటించుట నొకండు
నెట్టి గనులఁ జూచు నెంత వారి.
కనులు గలిగి వెల్ల గల్గుట నొక్కండు
నిలువ కెగురులాడు నిక్కి నీల్గి

పంచవన్నెలు గలవని బలుపు మీఱి
మిట్టి మీనౌచు మిన్నంటి మిడుకు నొక్కఁ
డేమి చెప్పుదు వారల యెగిరిపాటు ?
లెట్లు సైరింతు నెమ్మది నిట్టి చేటు?

అనిన నక్క "ఔరా! ఆటపాటల వారి యారంభశూరత్వ" మనుటయుఁ గాకి తన ప్రసంగంబిట్లు సాగించె—

వాయుసమ్మార్జనము చేసి, బలిని మెసవి
పృథ్వీజీవులకును, మఱి పితరులకును
నిహపరంబుల సద్గతు లిచ్చి ప్రోచు
వాయసంబులఁ "బలుగాకి" వారలనిరి.

కృష్ణనామస్మరణఁ జేయు గృధ్రపతిని
కడుకుఁ గొరగాని "పీతిరిగద్ద" యనిరి;
తైత్తిరీయ నామోపనిషత్తుఁ గూర్చు
వానిఁ "దీతువు" "దుష్టఁ" "డవాచ్యు" డనిరి.

నిలువు నీట జపము నెఱపు నిశ్చలమతిఁ,
గ్రౌంచనాథుఁ, "గొక్కరాయి" యనిరి;
ఒకరిఁ దెగడి విడువ రొక్కరి వారలు
పలుక నేమి యింక వారి పాటు?

కాని వారల గర్వంబుఁ గడకుఁ ద్రోయ
దైవ మిమ్మహిఁ గొలఁదిలోఁ దలఁపు సేసె;
అటులఁ గాకున్న వారల నడప వశమె?
బ్రతికితిమి దైవ మింక మా పట్ల నుంట?

పలుకులు పాటలు నాటలు
పలువన్నెలు చిన్నె లెల్లఁ బాపము వారిన్
ఖలులగు మానవ జాతికి
బలవంతపు బానిసలుగఁ బనివడఁ జేసెన్.

పడఁతులఁ బురుషుల నెడపియుఁ
బడవైతురు పంజరముల బాజో ; వారల్
వడు చెఱ లేమని చెప్పుదుఁ
బుడమిని "ప్రత్యక్షనరకమో" యన వలయున్.

పేరఁట కాలజ్ఞానం
బారయ నిది "నేతిబీర" యన్నటు లయ్యెం
గోరిక మెయి బానిసలై
కోరక గొంతిచ్చుచుంద్రు గ్రూరాత్ములకున్.

క్రూరుల సంతుష్టికి నై
ఘోరముగా నొక్క రొకరు గొంతులు వోవం
బోరాడి మడియు చుందురు
శూరతగల ఫలము నిదియె ? చూడుము సఖుఁడా !

జాతు లెంతయు మనుజుల జానిసలయి
ప్రాణముల నొసంగెదుఁ దృణప్రాయముగను;
ప్రాణములఁకన్నఁ దీపియౌ పసడి గ్రుడ్లు
వర్పణము సేయు; "హరిహరీ !" యనగ రాదు.

విప్పుకలు మ్రింగి హరియింప నేర్పు గలుగు
నుష్ట్రిపక్షులు నామనుష్యులకుఁ జిక్కి
జానిసేంద్రయి వారల భార మనక
గుఱ్ఱముల రీతి మోయుట గూడ నయ్యె !

తెక్కలుండిన ఖచరులే దిక్కు మాలి
చిక్కి, భువి పారతంత్ర్యము నొక్కొక యెడ
పలుపు చుండిరి, నానొడల్ జలదరించుఁ;
గాల మహిమంబు నేమనం గలము మనము!

నర పారతంత్ర్య బీజము
పరఖచరుల లోప, సత్త్వ వర్గంబుల నే
పఱఁ జేయుట, పన్యతనుం
గొఱవడఁ బోకుండ నిలుపుకొనుటయు విధియౌ.

కాన నొక్కరణముఁ గల్పింపవలయును
ఖచర సత్త్వములకుఁ; గడఁగి దాన
రూపు మాపవలయు రూఢి బానిస జాతిఁ;
గులము గౌరవంబు నిలుప వలయు

"జాతి మతాచారంబులు
నీతియు గౌరవము వోవునే నెయ్యెడలం,
జేతికి మించిన పని"యని
చేతంబునఁ దలఁచి యూగఁ జెల్లునె జడతన్?

ఘోరతర సమర మైనం,
దీరిన ఖగసత్త్వ మెల్లఁ దేజం బెడలన్,
మారదు నా నిశ్చయ; మిఁక
దారుణ రణ మెట్లు గూర్పఁ దలఁతువొ దానన్?

బానిసల నెట్లు గూల్తువొ?
మానితమగు జాతి నెట్లు మహి నిల్పెదవో?
భూనుతమతి సల్ప వలయు;
గానగు మన కార్యమెల్లఁ గడు గూఢముగన్.

నా విని వంచకుండు,

నేనే చెప్పుట, నీవ చేయుటలునౌనే? చిత్ర మయ్యెన్నుడుల్?
నీ, నా నేర్పులఁ జూపి తంత్రముల నెన్నేఁబన్నకున్నన్ సఖా!
కానౌ కార్యమె యిద్ది? యంత పయిపైఁ గాఁ దోఁచెనే? సర్వ స
త్త్వానీకంబుల, ఖేచరావళుల, జన్యక్షోణికిం దెచ్చుటల్

అది యట్లుండఁగఁ, బారతంత్రికుల సంహారంబు గావింప నె
మ్మది నే వేళల కేమి యోజ లొనరింపంబోలు నా కప్పు డ
య్యది బోధింపఁగ రాక సాధ్య మగు నయ్యా? నీవుపేక్షింప, నీ
కదనంబందున నిల్తు, నీవు గడిమిం గైదోడుగా నిల్చినన్.

ఆ నాడు సారథిత్వము
బూని "మహాభారత" రణమునఁ గాచితి; "కౌ
లీనము" న విపక్షత న
న్నీనాఁడు మఱెట్లు గావ నెంచితొ సఖుఁడా!!

శాకునికుఁడ వౌదు, సరగ జ్యౌతిష్కుఁడ
వౌదు, పైతృకుండ వౌదు, పార
మార్థికుండ వౌదు, వౌదు శౌచికుఁడవు
ప్రాణి లాక్షణికుఁడ వౌదు సఖుడ!!

అనిన నరిష్టంబు,

వాయుభక్షణమున వరలెద వంటివి,
నీవు నిరాహారనిష్ఠఁ గనవె?
సత్పథంబున నేను చనియెద నంటివి,
నీవు సమాధిని నిలువ వోటు?

శౌచికుండ నటంచుఁ జాటి చెప్పితి నన్ను,
నీవు శౌచికుఁడవు గావటయ్య?

శాకునికుఁడ నంచు సంస్తుతించితి నన్ను,
కావె శాకునికుఁడ వీవు సఖుడ?

ప్రాణి లాక్షణికుఁడ వంటివయ్య నన్ను,
నిన్ను మించిన యుక్తుల నేర నగునె?
యలఁతి గుణములు కొండంత లట్లు పలికి
తిలను "సజ్జన లక్షణ" మిదియె కాదె!

అదియట్లుండ నాఁడు భారతరణమున నీశ్వరాంశ నా యందు నిలిచినది. నేఁడది నీ వంతునకు వచ్చినది.

కృష్ణపక్షము గడచెఁ బోయింక మీఁద
శుద్ధ పక్షము రాకున్నె యిద్ధ చరిత!
అర్జునా! శుద్ధుఁడవు నీవయైన కతన
నిలుచు దేవాంశ నీయందు నిజము నేడు.

పోయి వచ్చెద సుఖముండవోయి సఖుఁడ!
యవసరంబైన యపుడెల్ల నరుగుదెంతు;
వలదు నాలోచనంబు నీ వలనఁ గొందు;
చెప్పవలసిన యుక్తులు చెప్పుచుందు.

అని వాయసంబు వంచకంబుచే ననిపించుకొని సమయప్రతీక్ష నుండె, నంత —

# ద్వితీయాశ్వాసము

క్రొడు రక్తిమము గన్న కమ్రామ్ర సంతతి
పరువు దప్పఁగ నాకుపచ్చ వాఱె
చివురులు లేక కోయిల పాట పంచమ
స్థాయి యెంతయును మాంద్యము వహించె
నాకు లల్లాడక నాఁగె వాతోద్ధతి
దిన మెల్ల యెండ పెళ్లనను గాసె
షడ్జస్వరంబున సాఁగి లేచెడి కేకి
కేకల కాక నింగియు ద్రవించె

గగనమార్గము నందు నాగడప వేసె
మూఁగి యెల్లడ పైని తూనీగ లాడెఁ
గూడి చీమలు దాపఁగ గ్రుడ్డు మోసెఁ
దొలకరిటు వానకారుకుఁ ద్రోవఁ దీసె.

అట్టి యెడ నొక్క చెట్టుపైఁ జేరిన కాకగృధ్రము లిట్లు ప్రసంగమున కుపక్రమించె. కాకి గ్రద్ద మొగము తేఱిపాఱఁ జూచి—

“తెల్ల మొగము వేసి తేపకువ సెడి యుంటి,
గ్రద్ద ! నేఁడిదేమి కారణంబు ?
తలకు మించదేని తగు యోజ సెప్పుదు
పరుడగాను, మిత్ర ! పలుకుమయ్య !”

అనిన గ్రద్ద దీనముగా నిట్లనియె—

ఆత్మపరిభవంబు నయ్య ! యేమని సెప్పఁ
జాలు వాఁడ సిగ్గుమాలి సఖుఁడ !
చెప్ప కేమి శేతుఁ, జిచ్చుగా నది మది
నెఱియఁ జేయుచుండె నెట్టు లోర్తు ?

తీర్ప నార్పఁ జాలు తీర్పరి వౌట, నీ
కెఱుకపఱతు నెట్టు లేని గాని
యోపి దాని నార్ప నొగి యత్నమొనరుపం
దాల్పవలయుఁ గంకణంబు నీవు

అనిన వాయసంబు—

నీ యవమానం బొక్కటి
నాయది వేఱొక్కటిగ మనంబునఁ దలఁపం
బోయిన నరిష్ట నామము
బాయక సార్థకతఁ జెందవలయును సఖుఁడా !

మాటలిక వేయు నేటికి
సూటిగ నొక మాట జెప్పఁ జూతును విను, ము
మ్మాటికి నే నా యోపిన
పాటి సహాయము నొనర్తుఁ బరిభవ మార్తున్.

అని చంచువునం జంచువుఁ గలిపి ప్రమాణం బొనర్చిన, గ్రద్ద తన కథ నిట్లు చెప్పం దొడంగె—

ఒక మసనము నందున, వి
ప్రకుమారుఁ డొకండు చచ్చిపడి యుండగ, నూ
రక వాపోవుచు బంధు
ప్రకరంబులు, చుట్టుకొనిరి పాయని కూర్మిన్

మందేహులు తన్నోరిచి
మ్రందింపఁగఁ జూచు నెడల, మానక తనకై
సందెలఁ దపించు విప్రుల
కుందుం గనలేక ప్రొద్దు గ్రుంకెఁ బడమటన్.

వారలు పోవంగనుఁ గాని
పాఱుని సుతశవముఁ గుఱుచ వలెనని యుండన్
వారల దుఃఖభరం బన
వారక చీఁకట్లు గ్రమ్మె వచ్చెను దిశలన్.

భాగ్య మిదెంత? వీరిఁ జనువం గల వాఁడను, నే శ్మశాన వై
రాగ్యము బోధ జేసి, యనురాగము దూరము జేసి యిప్డు, నా ,
భాగ్యము పండి వ్రాలినది, బాలకునిం భుజియింతునంచు, ని
ర్భాగ్యుని వాని తండ్రిఁగని పల్కఁ దొడంగితి నేఁ జమత్కృతిన్.

కొడుకని యెవ్వని కొఱకై
కడు నడలెదు నేలఁ బొరలి కాడనక యిటం
గొడుకను మిషచే వైరియె
కడుపుం జిచ్చునను గూల్చెఁ గా నిను విప్రా!

పైరికై నీవు దురపిల్ల వలదు వలదు.
మట్టి కేడ్చిన లాభంబు పుట్ట దెందు.
చీఁకటులు గ్రమ్మ భూతముల్ చిందులాడు.
ప్రేతభూమిని నిలువక వేగఁ బొందు!

అని వచించిన నా మాట లాలకించి
యచొటు వాయగ నుద్యుక్తు లయిన వారిఁ
జేరగా వచ్చి యిట్లను ఫేరవంబు
కరుణ పొంగులు దొలుకాడఁగా వయస్య!

పిన్నవాని మోము పున్నమచందురు
పురుడు వచ్చుఁ గళలు దరుగ వింక
కన్నవాని నొంటి గాటిలోఁ బడవైచి
కదలిపోవ నెట్లు కాళులాడు?

ఉన్నవా రింతవరకును నుంటిరి గద!
రాత్రి యగు దాఁక నిల్వఁగా రాదఁటయ్య!
యే మహాత్ముని గృప నేని యింత లోన
బాలకుఁడు పునర్జీవి గావచ్చు నేమొ!

అని వచించిన నక్క వాక్యములు వినుచుఁ
బోక నిలిచిరి యా ప్రేతభూమి లోన:
నవల నేను "వృథాయాస మయ్యలార!
చచ్చి మఱి లేచి వచ్చుట లెచ్చ టేని

చూచియున్నారలే మీరు ? లేచి పొందు !
పట్టి యడియాన కొలు" వని పలికి నాఁడ;
"కంచి గరుడసేవ" యని వచించి నాఁడ;
నింక నా వాక్యములు చెవి కెక్కవయ్యె.

ఇంత కది యిట్లు పలుకుట యెందు కొఱకొ
కరటమా ! బుద్ధి యోజింపఁ గలిగి నావె ?
రాత్రి గా నా కనుల్ గనరాక యుండఁ
దానొకండ భుజింపఁగ దలఁచె గాక;
కటికి నక్కకు నక్కటికంబు గలదె !

పంచకంబు వచనంబు లాకర్ణించి, పోక నిలిచిన బ్రాహ్మణుండు బంధువులం
గూడి ఈశ్వరు ధ్యానించుచుండ, నంత —

పసుపు బూఁతలుమీఁది, మసనంపు వెలిబూది
 తొలి మలి యడుగుల నలఁది యుండ,
పెలఁది పసిడి సాలు, పెద్దమెకము తోలు
 మొలఁ గుడి యెడమల ముడిచి యుండ,
చినుకు పూసల పేరు, పునుకల సరితీరు
 యురమున నిరుగడ మురువు సూప,
పసిఁడిగాజుల పంబు, విసదారి కడియంబు
 పలకేల డాకేల వరలు చుండ,

అమర కల్ప ప్రసూతమై యమరు పువ్వు,
అమృత నిష్యంది యా పువ్వు నవల నివల,
తన శిరమ్మందు వెలుగొందఁ గనుల విందు
గా, నుమామహేశ్వరుడు సాక్షాత్కరింప.

బ్రాహ్మణుండు ప్రాంజలియై,

"గొడగూచి యేడ్పుడుగుటకుఁ బాల్ద్రావితి,
సతి కాంక్షఁ దీర్పగ నగము నైతి,

వమృతకరుని రక్షకై తల యిచ్చితి,
శౌండికై పులిగల్లు కుండనుంటి,

చిరుతొండ నంబికై చెఱకులు మోసితి,
మృతు సిరియాళు రప్పించు కొంటి,

యమునంటి తరిమి నంయమి సుతుఁ గాచితి,
విశ్వహితముఁ గోరి విసము గొంటి;

భక్తులకు నీ వొనంగని ఫలము గలదె?
శంకరా! హర! భక్తవశంకరా! కృ
పాకరా! నా కుమారు ప్రాణానిలములఁ
జేర్చి కూర్చి పునర్జీవిఁ జేయలేవె?"

అనుచు దీనముగా నాతఁ డాడినంత
నతుల కరుణాబ్ధి మందస్మితాననమున
"వెఱవకుము, నీదు సుతుఁడు జీవించు!" ననియె
ధరణి సుర సత్తమునకు సదాశివుండు.

మాట మాత్రన బాలుఁడు మాటలాడె
లేచి కూర్చుండి నిద్దురలేచినట్లు
బంధు లెల్లరు సంతోష పరవశులయి
పులకరించిరి యేమనఁ బోలు నహహ!

అంత మా వంక నీశ్వరుఁడట్టె చూచి
"యోయి గృధ్ర సృగాలము లొయ్యవినుడు!
కడుపు కక్కుఱితికి నింత గ్రంథే మీరు
నడిపితిరి గాదె వీరితోఁ గడిమి మీఱి!

మీకు నికపయి నాకలి మిక్కుటములు
లేక పోవుటలును గూడ లేక పోవుఁ
దినినఁ దినకున్న నొకరీతి దినము గడచు."
ననుచుఁ బల్కి యంతర్హితుఁడయ్యె శివుడు.

వింటివే మిత్ర! జరిగిన విధము నెల్ల?
పూస గ్రుచ్చిన రీతి నైపుణ్యమునను
బలుకఁ జాలినవాఁడ నిప్పటికిఁ గథను
కంచి కంపెద, నిఁకఁ జేయఁ గలది యేమి?

నక్క నుడి గెల్చె, నా మాట యెక్కదయ్యె
నను మహావ్యథ నా హృదయమునఁ బొదలె.
దీనికిఁకఁ బ్రతీకార మేదేని సలుపఁ
జాలకుండినఁ దలయెత్తఁ జాల సఖుఁడ.

అనిన విని కాకి యానంద మంది మదిని
నిద్ది సాకుగ నాహవం బేను గూర్తు
సత్త్వ సమితికి ఖేచరసంతతికిని
బడయ నగు దాన మన్మనోవాంఛితంబు.

గ్రద్ద పరిభవ మార్చిన కరణి నుండు
మన్మనోరథ మీడేరు మహిత గతిని
దీర్ఘమును స్వార్థమును గూడఁ దీరగలదు
ఇంతకన్నను పురుషార్థ మేమి కలదు?

అని యోచించి, లేని యాగ్రహంబుఁ దెచ్చికొని, యక్కరటంబు గరుడునితో నిట్లను.—

"నేల బొఱియల నుండు సృగాల మేడ!
సత్త్వభుఁ బరాభవింపఁగఁ జాలు టేడ!
ప్రాణములతోడఁ బుడమిపై వరలు టేడ!
ఎట్టి చిట్టెలు వినవయ్యె నీ ధరిత్రి!

ఇదె ప్రతిజ్ఞను గైకొంటి నేను వినుము:
సర్వసత్త్వ విహంగమ సమరమైన
వనము లెల్లను బృహదసృగ్వనధులైన
నక్క జిత్తులు గ్రక్కింతు నిక్కడంత."

# తృతీయాశ్వాసము

అది విహంగమ మహాసభ. ఖచరనిచయం బెల్ల నుచితాసనంబుల విరాజిల్లుచుండ, రాజయిన రామబంధు సింహాసనమునుండి లేచి, సభ్యుల వంకఁ జూచి యిట్లు వాక్రుచ్చె. "ఓకవి, ద్విజ, ఖచర ప్రముఖులారా! వింటిరిగదా! గరుటామంతుని పరాభవము. దీనికి మనము ప్రతిక్రియ నొనర్పకున్న మన మేటి మగంటిమికి లోటు వాటిల్లఁ గదా! అయినను,

మంత్రియై రాజసింహుని మదికి నెక్కి
శత్రువీర కళేబర జంబుకమ్ము,
కలుష కర్మతారిగళత్సృగాలము, మహి
మృగ వినీతి కోవిదులలో మిగులువాడు.

మొనసి వంచక, గోమాయు, భూరిమాయు,
క్రోష్టుముఖ బిరుదావళిఁ గొమరు మిగులు
ఘనుని జెనకుట సామాన్యకార్య మగునె?
తివిరి భేదంబుచేత సాధింపవలయు.

ముందు వానిని మన ఖగవినీతిచేఁ బదభ్రష్టునిఁ గావించి,

దిక్కుమాలి బోటియ ప్రక్కలఁ జెరలాడ
నుక్కుబొకు లట్టు లుక్కు మీఱ
ముక్కు వాఁడి సూపి యుక్కడఁ గింపనొ
తక్కుకెన్ని యెడల నక్క సెడునె?

తద్భేద కార్యనిర్వహణంబునకు జాగరూకుఁడగు ఖగనీతి వేత్త యొకఁడవశ్య మావశ్యకము. అట్టివాని నొక్కని నిర్ణయించు భార మిప్పుడు మీ పై నిల్పుచున్నాను. అనినఁ బులుఁగులు దమలోఁ దాము గుజగుజలు వోవుచుండ, మైనా గోరంక లేచి యిత్తెఱంగునఁ బలికె—

కనులు మేనెల్లఁ గల నేర్పు కాఁ డితండు;
ఘనులఁ గనుఁ గొన్న నానంద కలన నాడు;
సాటి మీరిన యంగ సౌష్ఠవము వాఁడు;
నెమ్మి రాయబారము సమ్మతమ్ము సుమ్ము.

అనినఁ గొంగ గోరంకిని ప్రతిఘటించి.—

విషధరములఁ గన్న విఱ్ఱవీఁగెడి వాఁడు;
సహితు నింత గనిన నాగ లేడు;
నెమ్మి గాని, పలుకు నెమ్మది నెఱుఁ గఁడు;
రాయబార మెట్లు రాణ కెక్కు?

అనిన బెగ్గురు లేచి ఈ సరసునిఁ గైకొన నగునని ప్రేలుపొడిచ్చి,

స్వచ్ఛమైనవాఁడు, సరసులలో నుండు;
మంత్రజపముఁ బూసి తంత్ర మూని
వైరి మీనులఁ దనవలను జిక్కించును;
కొంగ ఖగవినీతి కొదువ పడునె?

అనిన నా వాక్యములకు నెమ్మి సహింపక పీఠమునుండి లేచి, షడ్జస్వరమున ధిక్కరించి, సభికుల దిక్కై—

చెలువు దులకరించు చిత్రవర్ణుఁడు గాక
తెల్లమొగము చాలి తీర్చు నోటు?
కనులు గలిగి మెలఁగు ఘన సన్నుతుఁడు గాక
గ్రుడ్డి పక్కి కొంగ కూడు నోటు?

అనం గొంగ కనలి నెమ్మి నెదుర్కొని నీవు నా కీడగుదువా?

వెఱ్ఱి గంతులు వెట్టు వెంగలి నీ కెట్లు
నిశ్చల తపమున నిలువ నగును?
నిలువెల్ల నైల్యంబు నిండిన నీ కెట్లు
సద్వర్ణమునఁ గ్రాలుచంద మొదవు?
చెట్ల గట్లను బట్టి చెంగలించెద వెట్లు
పరస సంసర్గంబు సలుప నగును?
కనరాని కన్నులు గడువిప్పు నీ కెట్లు
కనుమూసి గను ప్రజ్ఞ గలుగ నగును?

ఘోర విషధరంబులఁ దిను కుటిలమతికి
స్వచ్ఛ జలపుష్పములఁ దినవచ్చునెట్లు?
వేష భాషల నటకుడై పెలయు నీకు
స్వచ్ఛ జీవనమునఁ బ్రీతి వరలు టెట్లు?

అట్టి బెట్టిదంపు మాటలకు నెమలి బిట్టుడికి నిట్టులను——

అహితులఁ జెండాడు నట్టి శౌర్య స్ఫూర్తి
నీరసంబున నుండు నీకుఁ గలదె?
సద్వర్ణసహితుని సౌందర్య విభవంబు
దుర్వర్ణునకు నీకుఁ దొడరఁ గలదె?

షడ్జస్వరాన్విత సంరావ మిమ్మహి
జపియించినను గర్గ(జమునె నీకు ?
ఘనుల( జూచి ముదంబు గనెడి సద్వర్తన
కొక్కరాయికి దొరకొనుట కల్ల;

కనులు గలిగి చరించు మాయనువు చనువు
గ్రుడ్డి వక్కన కేమి యెఱుంగ నగును?
అప్పులం బడి యీదెడు నట్టి నీకు
కాలకంఠుని విభవంబు గలుగు టెట్లు ?

....ఇట్లు బకమయూరములు పరస్పరము నిందించు కొనుచుండ రామబంధువు వారికి పైరముడుప( దల(చి మాధ్యస్త్యము వహించి యిట్టులను—

నెమ్మి:యెట( బోయె నీదగు నెమ్మి యెల్ల(?
గొంచ: యెట( బోయె నీదగు మంచితనము?
వైర మేటికి మీకు నిప్పగిది నిచట?
నిర్ణయించెడి వారము నేము గలుగ

అని శాంతివచనంబు లాడుటయు ననంతరంబు బాతు హంసమును పేర్కొని—

పరమ హంస, మిగుల( బదచమత్కృతి వాడు,
కవివరేణ్యతయును గాంచువాడు,
పాలు నీరు వేఱు పఱచు ప్రతిభ వాడు,
రాయ బారిగ( జన రాదె వీడు ?

అనిన బాతుపలుకులకుఁ జిలుక యడ్డుకొని—

కవివరేణ్యుఁ డైనఁ గడు మెత్తఁ దనమును,
పరమహంస యైనఁ బటురయంబు,
సారసములఁ దినియు నీరసమున నుంట
నితఁడు రాయబార మేమి నడపు?

అనుటయు నప్పలుకు లాలకించి, క్రోధ ఘూర్ణమాన మానసమై మానసౌకము—

ఆకు లండ జేసి యంట డాగి దొంగపై
యర్థహీన మైన యట్టి పలుకు
లాడు నీకు మాకు నంతరం బెంతయో
తెలియ లేక పోతి తెలివి మాలి—

అనిన విని చిలుక యలుక దెచ్చుకొని,

సరసుల సంగతి సలుపుదు మన మీరు,
సత్పథ విహరణ చణుల మేము.
సారసంబులు భుక్తి సలుపుదు మన మీరు,
ఫలరసాస్వాదనపరుల మేము,
కవి వరేణ్యుల మోచుఁ గ్రాలుదు మన మీరు,
అలఘుపురాణవేత్తలము మేము,
మేలైన నడవడి మెలఁగుదు మన మీరు,
పలుకు మాధుర్యంబు గలదు మాకు.

పరమహంసలు నా మీరు బరగుదు రన
శుకవరేణ్యత మాకునుం జొప్పుగాదె?
విమల మానసముల మీరు వెలయుదు రన
రాగ శూన్యుల మయి భువిఁ గ్రాలు దేము

అనిన హంస యూ వచనంబులు సరకు గొనక నిట్లనియె— మాకు మీరెట్లు దీటు గా గలరు?—

విషమ మార్గంబున విహరించు మీకెట్లు
సరసుల సంగతి సలుప నగును?
ప్రతిఫలాపేక్షచేఁ బర్వువెత్తు మీ కెట్లు
పరమహంస ఖ్యాతిఁ బడయ నగును?
ప్రేమయే యెఱుగని పీరిఁడుల్ మీకెట్లు
విమలమానసమున వెలయ నగును?
సరస సాంగత్యము సలుపని మీ కెట్లు
కవివరేణ్యత్వము కలుగ నగును?

శుకులమని దొంగ వేసాలఁ జూడఁ బడక
గుజ్జు కొమ్మల మాటునఁ గూరుచుండి
తత్ఫలంబుల గ్రహియింపఁ దలఁచు ఖలులు
సాటిరాగల రొక్కొ హంసలకు మీరు?

ఇట్లు కలహించు కీరకలహంసములకు గరుడుఁడు మధ్యవర్తియై వివాద ముడిపి, రాజు తన ముఖంబునను బలికించినట్లు వారితో నిట్లను—

పరమహంసః శుకుఁడః పాడి గాదీవాడు.
మానరయ్యా దురభిమాన మేది;
క్రౌంచ మఱుగు నేడు రాయబారమునకు
పథికు లొప్ప వలయు పరగ దీని.

అనుటయు, ఖగరాజునకు మోమోడి ఖచరతల్లజులెల్లరును 'వల్లె' యని యూరకుండిరి; అంత రామబంధు నియుక్తం బైన క్రౌంచంబు రాయబారియై మృగరాజధానిఁ గనుగొంచి....

## క్రౌంచము రాయబారము:

రాజసింహుండు నిండు పేరోలగంబుండ సమీపించి, యెఱఁగి, ప్రక్కకు తొలఁగి, వినయ వినమ్రముగ నిట్లనియె—

ధర్మమునకయి హితునైన, ధనమునైన,
నేమి యైనను తృణముగా నిట్టి విడుచు
చతుర మతులు మీ వంశ కేసరులు గాన
రాజసింహమ ! ధర్మ విభ్రాజి వగుము !!

క్రౌంచ మిట్లు వచించుట విని, శార్దూలము రహస్యముగా మృగేంద్రముతో నిట్లనియె—

కాంచ నెడలను స్వచ్ఛమేగాని యితఁడు,
పిక్క మరయగ వెలియైన కొక్కరాయి;
యైన వచ్చెను దూతకృత్యంబు సలుపఁ;
గాన వీనిని నిరసింపఁ గాదు మనకు.

అంతట కొంగ రాచసింగముం గనుంగొని, "ఓ మహారాజా! అవధరింపుము. మా రాజు మీకు నా ముఖంబునఁ బుత్తెంచిన రాయబారంబు తెఱంగు వినిపించెద నని తన ప్రసంగంబు నిట్లు సాగించె—

వంచకుల మాయదారుల మంచు కతన
రాజసింహుల కఖ్యాతి రాక పోదు.
కాన నింతటి తోడ నీ కాని వాని
భూరిమాయుని విడుచుట పోలు మీకు.

విడువకుండిన సంగ్రామ భేరు లదరి
మ్రోయును; నభశ్చరవరుల పోటు తనము
కొంత చవి జూచి, యెవ్వారి యంతరంబు
లెట్టివో కను నవకాశమే యొదవును."

అని గృధ్రపరాభవ మాదిగాఁ గల సమస్త విషయముల విన్నవింప, సింహము తల పంకించి, మృగాంతికముగా వ్యాఘ్రమ్ముతో—

కలహ మేరితోడను లాభకారి గాదు.
భూరిమాయుని విడువఁగా బుద్ధి బుట్ట
దేమి సేయఁగఁ దోపని యిట్టి విషమ
సంధి దవిలితి నిపు డేమి సలుపువాఁడ?

అనిన వ్యాఘ్రము మృగాంతికముగా హర్యక్షము నీక్షించి యిట్లు వచించె—

తల మీఁదు పగలు పొగరుం
దలకడచిన భూరి మంత్ర తంత్రంబులలోఁ
దల నెరపి కొమ్ము మొలిచిన
బలు మెకమును నక్క విడువఁ బాడియె రాజా!

నక్క కొమ్ము వశీకరణప్రదముగ
నెంచి మానవుల్ శిరసా వహింతురు గద!
మనము దానిని వీడుకో మనసు పడుట
వలచి తన వెంటఁ బడు సిరి వలదటంచుఁ
గాలఁ దాఁచిన చందము గాదె రాజ!

భూరిమాయని విడుచుట బుద్ధి కాదు;
ఇకపై చేసెడి కార్యంబు వేఱ లేదు;
వంచకము లేని మన విభవమ్ము లున్నె!
కష్టఁ దెడ యైన భారతగాథ కలదె!

అనిన సింహము పులి పలుకులకు మిక్కిలి సంతసించి——నీ వాక్కులు నిక్కువములు,

ఇల శివాలయ మ్మందని యే వనమును
వాసయోగ్యము గాదను వాక్య మెఱిఁగి
నక్కనుం ద్రొక్కి వచ్చిన నాఁటి ఫలము
నెఱిఁగి మెఱిఁగి ఖేదమునఁ ద్యజింపు మెట్లు!

అని ప్రకాశంబుగా, క్రౌంచంబును నిరీక్షించి, "భూరిమాయుని విడిచిపుచ్చు నంతటి ప్రబలదోషంబు వానియందుఁ గాన రాదు. మీరాజు చారచక్షుఁడు గాక మైత్రిన వారి చేతిబిడ్డయై యిట్టి యహేతుకవైరమునకుఁ గడంగుట కరంబు ప్రమాదకరంబు. కాన నీ యుద్యమం బుడుగుట సమంజసంబు. కాని మీ తర్జనభర్జనలకు మేము బెదరు వారము కాము. కలహ మేరితోడను లాభకారికానేర దని మాత్రము మా మత" మని నొక్కి వక్కాణించుటయు, క్రౌంచము తన రాయబారము ఫలింపమికి విచారించుచు, రామబంధుసన్నిధికి మగిడి చనుదెంచి యావద్వృత్తాంతము విన్నవించె.

## రామబంధు సేనానాయక నిర్ణయము :

అంత కాకి రామబంధునితో — "రాజా! దేవర పంపిన రాయబారంబు నిష్ప్రయోజనంబయినది. వారు వంచకమును విడువ మనియు, మీ తర్జనభర్జనలకు వెఱవ మనియు స్పష్టముగా మనలఁ దిరస్కరించిరి. ఇక మన మూరకుండిన వారికి మఱింత యలసు గదా!" యనుచుండ గ్రద్ద తద్దయు రోషంబున, "ఇక రణంబున కంటె గత్యంతరము లేదు. అప్పుడుగాని వారికి మన యెడల లక్ష్యము గలుగ నేరదు." అని వచించె. అదివిని రామబంధువు, "సరే! కానిండు. యుద్ధప్రయత్నము లప్రమత్తులై యొనర్చుడు. తత్క్షణమే సేనానాయకనిర్ణయ మొనర్పవలె. మీ మీ సమర్థతలను బ్రకటించుకొనుఁడు. తగువారి నిర్ణయింత" మని నంతనే, గ్రద్ద పీఠము నుండి లేచి కాకమును జూపి—

పదుగురు గలాఁడు, మిగుల నుపాయ శాలి,
కలుపుగోలు తనంబునఁ గ్రాలు వాఁడు!
ఒంటి చూపైనఁ, బరుల మేలోర్చువాఁడు.
కాకియేఁ దగు సైన్యాధికారమునకు.

అనుటయు నెల్లరు నామోదించిరి. అనంతరంబు గిజిగాడు లేచి—

అహితులను చీల్చి చెండాడునట్టి వాఁడు,
సాటిలేని తనూ విలాసంబు వాఁడు,
నెమ్మి గలవాఁడు నటకుఁ డు నెమ్మి వీఁడు
సరసమౌ మేలి షడ్జనిస్వనమువాఁడు.

అని మయూరమహత్వంబు నభి వర్ణించి, నెమిలి నెన్నుకొనియె; నందులకు సభికు లామోదముం బ్రకటించిరి. మఱియు రామబంధువు సభ్యుల నుపలక్షించి——

కన్ను వాఁడిగలఁడు, గడువడి గలవాడు,
సత్పథమున నెగిరి చనెడి వాఁడు,
తలల నెత్తిన యహితుల నెత్తి యడచెడి
వాఁడును ద్విజరాజు బిరిర! యితడు.

అందుచే గృధ్రమును సర్వసేనాధిపతిగ నెన్నుకొందమనుటయు. సభ్యులు కరతాళధ్వనుల కోలాహలముతో సమ్మతిం దెలిపిరి. తదనంతరము బాతు ముందున కుఱికెంచి——

చరణ మాయుధముగఁ బోరఁ జాలువాఁడు
కాల మెఱిఁగి విజృంభించి కలన దుమికి
కంఠమందున నూపిరి గలుగు వఱకు
వెన్ను జూపక నిలిచెడి వీరవరుఁడు.

కాలజ్ఞుండై దా, లో
కాలఁ బ్రబోధింప కున్నగాఢ ధ్వాంతా
ఖీల నిశాప్రకరంబులు
నేలీలం దెల్లవారు నిమ్మహిఁ బ్రజకున్?

కనుక కుక్కుటంబు సేనాధిపత్యంబునకుఁ దగుననుటయు గ్రద్ద గ్రద్దన నిట్లు పలికె. "వహ్వా! ఎంత బాగుగాఁ చెప్పితివి,

వీని వంకరకూతల వినుటతోనె
తెల్లవారెనె ప్రజ కెల్ల దిక్కులందు?
లేక యుండినఁ జీకట్లు పోకయున్నె ?
'కోడి కుంపటి' శాస్త్రముం గూర్చి నావె!

అనుటయుఁ గోడిపుంజు క్రోధముతో లేచి గొంతెత్తి యఱచుచు గ్రద్దం జూచి యిట్లు పలికె—

ఒడుపు వేసి దొంగ వడువునఁ బిల్లల,
గ్రుడ్లఁ గొల్ల గొట్టు కూళ వీవు
తొడరి నిన్ను గ్రుడ్లు దోడక విడుతునే
కత్తి గట్టి పోరఁ గడఁగు దేని?

అనిన గ్రద్ద గద్దించుచు—

గొంతు కోత కొఱకె కూత వచ్చిన పుంజు
క్రావ్వి గుడిసె నెక్కి కూసి నట్లు
వక్రగతుల నేల పదరెదు రా కూళ!
కట్టి పెట్టి గొంతు కాచుకొనుము....

అని నిందించుటయు, రాజైన రామబంధువు కలిగించుకొని "వాక్కలహము లేల? యుడుఁగుఁడు. పుంజు నామోదించువారు చెక్కలెత్తుఁడు." అని వచించెను. అధికసంఖ్యాకుల యామోదముం బడసి కోడి యెన్నిక నెగ్గెను. తర్వాత, పైడిగంట మిట్లు పల్కె—

క్షాంతి పలుగాకి మూఁకల అంతు నొర్చి
సమయమును జూచి పైకెత్తి చని, కుటుంబ
ములను నాశము జేసి సమూలముగను
కౌశికఖ్యాతి వెలుఁగొందుఁ గాదె గూబ?

కనుక నేను గూబ నెన్నుకొనుచున్నా ననుటయు, కాకంబు గూబను ప్రతిఘటించి యిట్లనును.—

నిదురపాటున వాయసనివహములను
జంపఁ జూచెడి ఘోరనిశాచరుండు
రక్త మొలికెడి మిడిగ్రుడ్లఁ గ్రాలువాడు
తగదు గూబకు నాయకత్వము నొసంగ.

అనిన రామబంధువు గూబనాయకత్వము నొప్పుకొనినవారిని వెక్కలాడింపుఁ డని యనుటయుఁ, దిరస్కరించిన వారి సంఖ్యయే మిగిలెను. కనుక గూబ నాయకత్వము నిలువలేదు. అందులకు గూబ ఆగ్రహావేశమున లేచి, రాజువైపు గ్రుడ్లురిమి చూచి—

పేరు గలవారిఁ బెద్దల విడిచిపుచ్చి
కాకి మూకల మన్నించు ఘనులకెందు
జయము గలుగుట కల్ల, నిశ్చయమ యోటు;
పెద్దలవారల శాపముల్ వితథ మగునె?

పెద్ద వారలపైని విద్వేష మొకటి
స్వల్పుల నరిష్టుల గణించు చందమొకటి
పాలకులకు నీ కలికాల పటిమ వలనఁ
గలుగు ననుటలు నిక్కంబు గాఁగఁ దోఁచె.

అని తల పంకించి కూరుచుండుటయు, సభయెల్ల నల్లకల్లోలమై తల్లడిల్లె, నంత భరతపక్షి—

స్వచ్ఛమగువాఁడు, సరసుల జాడ నుండు,
పాలు నీరును విడఁదీయు ప్రతిభగలఁడు,
జవము గలవాఁడు, సన్మార్గ చరుఁడు, రాజ
హంసుఁడు తలపోయఁ బరాక్రమైకధనుఁడు.

అని యగ్గించి రాయంచ నెన్నుకొనుటయు, అందులకుఁ జిలుక ప్రతిఘటించి—

తలకు మించిన యప్పులం దవిలి యీఁదు
లాడుచు దరిజేరఁ గలుగు నాస లేక
మిగుల మెత్తనై వెలవెల నగుచుఁ, గాళ్లు
పుల్ల వడ, మోముగందఁగఁ దల్లడిల్లు
హంస యేపాటి సంగ్రామమందు నిలువ?

అని తూలనాడిన రామబంధువు అంగీకృతుల సంఖ్య లెక్క చేయించెను. తిరస్కారులకంటెఁ బురస్కారు లెక్కువగుటచేను హంస నాయకత్వ మంగీకృత మయ్యె—

ఇచట రాజసింహుని సభయందు సేనానాయక నిర్ణయము ప్రసక్తం బయ్యె నంత సింహము నిండు కొలువుండి, "సభ్యులారా! రామబంధు యుద్ధప్రయత్నము లొనర్చుచున్నట్లును, సేనానాయక నిర్ణయ మొనర్చినట్లును వేగుల వారివలన నెఱుంగ వచ్చినది. మనమును తత్ప్రయత్నమున నుండవలయును. ముందు సేనానాయక నిర్ణయ మొనర్పవలసియున్నది. కనుక యీ సమజము నందలి వారెల్ల మీ మీ

ప్రభావాతిశయముల వెల్లడించుకొనుట కిది యదనని నిన్న లొట్టిపిట్ట కంఠమ్ము సాచి యుత్కంఠమై నిట్లనియె—

లావుగలవాఁడు, గడుతుములంబునైన
నాహవంబున నచల మట్లాగువాఁడు,
ఆకృతిని పెద్ద, జ్ఞానంబునందు పెద్ద,
యూథపతి చూడ సార్థకయూథపతిగ.

అని యేనుంగు నెన్నుకొనుటయు సభ్యులెల్లరు సమ్మతించిరి. అనంతరము తురంగము ఒంటె నుద్దేశించి యిట్లు వాక్రుచ్చె—

ఈ మహాంగము వికృతాంగమేని గాని,
పదియునైదు దినంబుల వఱకు నీరు
పట్టు, నాతప తాప తీవ్రత సహించి
ఇసుక సంద్రము దాటింప నిదియె దిక్కు.

ఇసుక తుఫానుల కోరిచి
అసాధ్యభారము వహించి యతి సాహసియై;
నిసి హిమ శైత్యము నోరిచి
కసవే గ్రాసముగ బ్రదుకఁ గల యుష్ట్రమిదొ!

అని యెడారి యోడ నెన్నుటయు, దాని యెన్నిక నెగ్గినంత జింక తురంగమును కురంగట నిలిపి యిట్లనియె—

సమరవిధు లెల్ల మానవజాతి చేతఁ
గరపఁ బడి కృతప్రజ్ఞుఁ డై గ్రాలువాఁడు,
వేగవంతుఁడు, సుజ్ఞాని, వీరవరుఁడు
సైంధవుని కంటె నెవ్వఁడు సాహసికుఁడు?

అని గుఱ్ఱము నెన్నుకొనుటయు నందఱు నామోదము ప్రకటించిరి. అనంతర మెనుబోతు వృషభరాజమును ముందుంచుకొని యిట్లు భాషించె.—

కొమ్ములు గొఱిజలు గలఁడై
పొమ్మని బుసగొట్టి కాళ్ళనూది ధరిత్రిం
జిమ్ముచు అంకెలు పైచుచు
గ్రమ్మెడు గిబ్బ సరి పోటుగాఁడుం గలఁడే?

అని యెద్దు నెన్నుకొన సభ్యు లామోదముం జూపిరి. అయ్యెడ మృగరాజు ముచ్చన్నె మెకంబును ముందుంచుకొని—

ఘాతుకుండైనఁ బులిబిడ్డ గాఁడె వీఁడు?
అదరు బెదరు నెఱుంగఁడు నట్టె నాకుఁ
గుడి భుజంబుగ ద్విజులనుంగూల్పఁ గలఁడు
మిగుల బలశాలి విపులగాంభీర్యమూర్తి.

అని పలికి పులి నెన్నుకొనుటయు, సభికులు మెప్పుమై నొప్పుదలఁ జూపించిరి అంతట పెద్దపులి తన ముద్దుల మేనమామ నుద్దేశించి—

తిన్న యిలు గుద్దలించుచున్న పంది
కొక్కుల పనులెల్లఁ గడఁగి చక్కఁ బఱచి,
మించి మానవసేవఁ గావించువారు
పిల్లివలె నున్న ఘనతకు పెలితి యగునె?

పిల్లి యడుగులు పెట్టుచు వెళ్ళవలయు
గోడపైఁ బిల్లి వాటము గొడవఁ దెలిసి
సమయమును జూచి వైరిపైఁ జక్కఁ దుమికి
చంపవలయును-నియ్యవి సమరవిధులు
పిల్లికంటెను దెలిసిన వీరు లెవరు?

రాత్రిఁ జీఁకట్ల జూచు నేత్రద్వయంబు
సద్దు సేయక నడచెడి చరణములును
రమ్మనన్ వచ్చి మఱలి పోపొమ్మనంగఁ
బోవు కులిశాయుధమ్ములఁ బోలు గోళ్ళు.

నారసంబుల మించిన కోఱపండ్లు
నాకు జాతిని జాచెడియట్టి నాల్కఁ
ఈశ్వరప్రసాదములుగా నెనసియుండ
సాహసంబన నెంత మార్జాలపతికి!

అని బిడాలప్రభావం బభినుతింప సభికు లామోదించి పిల్లినెన్నుకొనిరి. ఆయ్యవసరంబునఁ దోఁడేలు.—

తాటి కెగఁ బ్రాకఁ గలవాఁడు, త్రాగుబోతు,
గొడ్డువలె నెంతపనికేని కొదుకు పడఁడు,
పట్టెనేని భల్లూకపుఁ బట్టు పట్టు,
నెలుఁగుగొడ్డును మించిన మృగము లేవి?

అని యెలుఁగు నెన్నుకొనుటయు దానికి కొర్నాసి ప్రతిఘటించి—

త్రాగుబో తనుమాట మాత్రంబె గాని
బెదరు మిణుగురులం గన్న విదిత మింత
వచ్చు తెఱఁగు నెఱుఁగక లోఁ జొచ్చుముచ్చు
మచ్చుగా నెక్కుఁబే గాని మఱలి డిగ్గ
నెఱుగకే మొద్దు వలెఁ బడునిల నెలుంగు.

అని దాని యయోగ్యతం బ్రకటించుటయు నెన్నిక రాకుంటచే నెలుంగు త్రోసివేయంబడె. అంత చిఱుతపులి జంబుకంబును బెద్దసేసి—

కూనలేదైన మిగుల సంతాన పరుఁడు
పెక్కు జిత్తుల నెఱిగిన యుక్కుతునుక
పూర్వగాథలఁ బెక్కింటఁ బొగడికఁ గను
పుక్కిటి పురాణ పురుషుండు భూరియశుఁడు.
నక్కగాదగు సుమి మహానాయకుండు.

అని యెన్నుకొనుటయు నందులకు సభికు లామోదంబు తెలిపిరి. అంతట నూసర వెల్లి యురగ రాజము నుద్దేశించి—

తలయుఁ దోఁకయుఁ గొప్పగాఁ దనరు వాఁడు
కాలు నేలానక చరింపఁ గలుగు పుట్టు
భోగియు, శిరోమణిం గల ప్రోఢ యితఁడు
పడగ నెత్తిన వీరసర్పంబు తగఁడె?

అని ప్రసంగించుటయు భుజంగప్రసంగమునకుఁ గటకటఁబడి ముంగిస యిట్లనియె—

అహితుఁడై మానవులచేత నధమమైన
పాముగాఁ జూడఁబడు సన్నపాటి పురుగు
విసపు జంతు వనన్ జగద్విదితమైన
అపయశంబును గడియించినట్టివాఁడు.

కాయమెల్ల వంగి, కన్నులు పొర గప్పి
కాలు పేద యగుచుఁ గళ వశించి
నేల బొఱియలందుఁ గాలమ్ము బుచ్చెడి
పాము మాట యింత పలుక వలెనె?

అని ప్రతిఘటించి దాని గౌరవముఁ జెఱచుటయు పన్నగం బెన్నికకు రాదయ్యెను.
చివరకు సింహము గ్రామసింహము నభిలషించి యిట్లుభాషించె—

బొంచ కడను నక్క వోలె కావలి యుండుఁ
గాని నమ్మఁ దగని ఘనుఁడు నక్క.
కుక్క, బుద్ధి గలిగి కొలుచు నమ్మకముగ
నమ్మఁ దగిన బంటు నాకుఁ గుక్క.

అని సెలవిచ్చికొని, సభికుల దిక్కై యుద్ధకాలమున, నాహారపదార్థములఁ
గాపాడ వైరిభయంకరుఁడగు భైరవమూర్తిని నిర్ణయించుచున్నాను.

ఈకృతప్రజ్ఞు, విజ్ఞు, పరేంగితజ్ఞు,
ఘోరతరవైరిసమవర్తి, భైరవపతిఁ
గరము నచ్చిన బంటునుగా గ్రహింతు
సమ్మతిం జూపవలయు నోసభికులార!

అనిన సభ్యులందఱు నామోదము బ్రకటించుటయు రాజసింహంబు యుద్ధ
సన్నద్ధంబై సకలసేనాసమేతంబుగా రణభూమిం దరియసాగె.

# చతుర్థాశ్వాసము

నిండుగా వరిపైరులు పండఁ బాఱెఁ
బండు వెన్నెల పంటలు నెండఁ బాఱెఁ
జెఱకు బెల్లము వంటల చేతఁ దీఱెఁ
గోడిపుంజులు తమగొంతు కోతఁ గోరెఁ—
గూలివారల భాగ్యము కూడఁ బాఱెఁ
ద్రాగుబోతుల జూదాల తగవు మీఱెఁ
దెల్ల మబ్బుల చెలువెల్లఁ దెల్ల వాఱె
వారెః తెలవార గూడలువాఱె మంచు
ముంచుకొనివచ్చె నెంతలో మంచు కారుః

గ్రద్ద పరిభవ మార్పఁ, దీక్ష్ణతర బుద్ధి
సత్త్వజాల వినాశము సలుపఁ దలఁచి
దాడి వెడలు ఖచరుల క్రోధరసమనఁగ
నెఱ్ఱగా నదె యినబింబ మెగయఁ జొచ్చె.

ముందు రానున్న "కౌలీనము" నకుఁ గుంది
క్షుభితమతి వనలక్ష్మి యుస్సురని విడుచు
చున్న నిట్టూర్పుగాడుపులో యనంగ
నిగిరి పొగమంచు మింటికి నెగురఁ జొచ్చె.

ప్రబలదుఃఖమునకు జాలువారు బాష్ప
బిందు సందోహమో యన వృక్షవితతి
నుండి జొటజొట రాలుచునుండె నరరె!
మంచు బొట్టులు విధివిరామంబు లేక.

అట్టియెడ—

అభ్రవాహిని భూమి కవరోహణము సల్పు
     ననువుగా ఖచరవాహినుల సద్దు
కార్ముక సముదాయ నిర్ముక్త ఖగపరం
     పరలట్లు ఖగపరంపరల రయము
హంసప్రకాండంబు నల్పం బొనర్పంగ
     హంసప్రకాండ తేజోతిశయము
అల విహాయసమెల్ల నాక్రమింపఁగఁ జాలు
     నల విహంగమ చమూ కలకలంబు

భువికి డిగి వచ్చె ద్విజబలనివహములును
నేల యూనిన వడువున నిలిచి పొలిచి
తెల్ల యెడలను వారలై వెల్లివిరియు
సాగరం బన నెందును సందు లేక.

సాటికి జెక్కలు గలపై
పాటవమున మింటఁ దిరుగువారలు నోటం
గీటక సముదాయంబులు
కూటమియై ప్రబలఖచరకోటిం గలసెన్.

క్రిములు, సరీసృపములు, స్వ
ల్పములు ననల్పములు నైన, బహుసత్త్వానీ
కములు గుములు గుములుగనై
సమరాంగణముననుసత్త్వసమితిం గూడెన్.

సింహనాదంబులును, గజబృంహితములు,
తురగహేషారవంబులుఁ బరగుచుండ
సత్త్వపదఘట్టనంబులు సాగుచుండ
సత్త్వసైన్యంబు చతురంగసైన్య మయ్యె.

నాయకులు నంత నుభయసైన్యముల యందు
వ్యూహములు దీర్చి డీకొన నుద్యమింప
రణగుణధ్వని కప్పలరవళి యలరె
ఖచరసత్త్వప్రకాండముల్ గలయ నార్చె.

ద్విజులు, ఖచరులు, కవివరుల్, ధీరులుండి
పశువుల, మృగమ్ముల, సరీసృపములఁ, గ్రిముల
గెలువ లేకున్న తెక్కలు గల ఫలంబు
కలదె ! యని ఖగాధిపుఁడు బింకములు పలికె.

రాజిసింహులు, యూథపుల్, తేజులుండి
పక్షులను కీటకములనుం బవర మందు
గెలువ లేకున్న సత్త్వముగల ఫలంబు
కలదెః యని మృగాధిపుఁడు బింకములు పలికె.

రాజసింహుని బరాక్రమ మొక్క యెడలను
రామబంధు మహోగ్ర రావ మొకట
భైరవ స్వామి యార్భాటంబు లొక క్రేవ
కుక్కుటేశ్వరు శౌర్య మొక్క కెలన
మార్జార నాయకు మహిమంబు నొక చోట
చిరజీవి శేఖరు నురవొకంట
భల్లుకేశ్వరు ప్రతాప స్ఫూర్తి యొకజాడ
కవిరాజ సింహు విక్రమ మొకదెస

ఉగ్ర పుంగవువిక్రాంతి యొక్క ప్రక్క
ఖచరపతి శౌర్య మొకపట్లఁ గానుపించె;
యూథనాథుని దోశ్శక్తి యొక్క మూల
కౌశికు ప్రభావ మింకొక్కకడఁ జెలంగె

భల్లూక నాయక ప్రబల భీష్మత్వముఁ
దొడరు కాకోల విద్రోణతయును
యూథనాయకుల దుర్యోధనత్వంబును
శార్దూల భయద దుశ్శాసనతయు
నొనరగా శశకమహోచ్చ కర్ణత్వంబు
శల్యవైరి హృదయ శల్యతయును
రాబందు భీమ సంగ్రామ సంరంభంబు
విక్రమ సింహ సద్విజయతయును
వికిర రాణ్ణాయక శకునిత్వము, నకుల
నాయకాహిత వర్గ నకులతయును
దర్వీకరాధిప ధర్మగుణాంచిత
మూర్తిత్వము, విరాజముఖ్యతయును

సైంధవాధిప సముద్యగ్ర సైంధవతయుఁ
గృష్ణసారప్రభాసార కృష్ణతయును
దోఁపఁ "గౌలీన" మత్యంత తుములమగుచు
రహిఁ జెలంగెను భారతరణము వోలె.

కాని యింతలో నొక ప్రమాద మొదవె: అదియెట్టిదనిన—

పశుబలంబుల మునుముందు బాదు దీర్చి
మృగ చయంబుల వెనువెంటఁ దగులు నట్లు
భూరిమాయుఁడు నిలుపుటఁ బుట్టెఁజేటు
సత్త్వ సైన్యంబునం దొక చందమునను.

కలలో సింగముఁ బొడఁ గన
విలవిలఁ దన్నుకొనిచచ్చు వేదండతతుల్
కలదా సింగము వెనుకన
కలఁగక, తొలఁగకను నిల్వఁ గలవే కలనన్?

వాహద్విషముల ప్రక్కను
వాహంబులు నిలిచి యెదుటు వాయక యున్నే!
సాహస మెంత వహించిన
మోహరమున నిల్చి పోర ముందుకుఁ జనునే!

వృక సందర్శన మయినన్
వికలంబయి మానసంబు వెంగలితనముం
బ్రకటించుమేక, లేడిక
లకలంకత ముందుఁ జనునె యాహవ మందున్ ?

పులివాసనఁ బసి వట్టిన
కలవరమున బెదరి చెదరఁగల పుంగవముల్
గలనంబున మును నిలిచిన
బలబల మూత్రములు విడువఁ బాల్పడకున్నే ?

మృగములు ముందుగ నిలుచునె
మృగాదనములు వెనువెంట మిగులం దరుమం
బెగ డొందక, కడుఁగుందక
సుగమంబుగ రణము సేయఁ జొరబారునొకో ?

సహజ వైరులగు పెక్కు జంతువు లొక్కచో నిల్చి పోర నమ్మికలు లేక పెక్కుచెదరి యుక్కడంగెను.

బలునెత్తి కొమ్మువారలు,
మెలి దిరిగిన కొమ్ములారు, మీటిన కొమ్ముల్,
చిలువలు పలువలు గల కొ
మ్ములవారలు దిటవు కొమ్ముపోతులు పడలెన్.

గండుపెడి, బెండువడి, కలగుండు వడియు
చెల్లచెదరయి, బెదరియుఁ, జిక్కి స్రుక్కి,
త్రొక్కటంబడి కడువొక్కి, దిక్కు దక్కి
సంకటంబడెఁ బకచమూ సముదయములు.

అట్టి మోసంబునకుఁ గటకటఁబడి—

నోరుమాలిన సాధు జంతువుల మమ్ము
సత్త్వజాత్యుద్ధరణ మను సాకు చేసి
వన్యములు మీర లీరీతి వంచకంబు
చే సగంపడఁ జేతురే చిత్రకలిగ?

ఇంత కింతగ నీపాప మినుమడించి
కట్టి కుడుపక విడుచునే ఖలుల మిమ్ము?
సాధుకోపము నెంతకేఁ జాలునంచుఁ
బకగణంబులు నిలువక బాఱఁ జొచ్చె.

అట్టియెడఁ బకులు సత్త్వసమితి వెనుకొని తరిమి, చించి చెండాడుచు హేళన మొనర్పం గడంగె నయ్యెడ కొంగ ముంగల కరుదెంచి—

పోటరివై నిలంబడక పోయెద వెక్కడి కెంత దవ్వు? నే
బాటను బట్టి పోగలవు? పట్టి దురాశ యిదేల నీకు? ని
చ్చోటికి వచ్చుటే విసము జుఱ్ఱుట; యింతకు వంటయింటి కుం
దేటివి, యెందుఁ బోగలవు? తీరిన వాఁడవుగాఁ దలంపుమా!

13)

అని చెవ్వలపిల్లిని నిలువరించి, చెవులంబట్టి యాడించుచు, నెత్తురులు చిందింప, కుందేలు వెఱవు గావక నటునిటు పాఱిపోఁ జూచి నంత, కాకి యుద్రేకమ్మున జంబుకంబును నిరోధించి—

మాయలు మంత్రంబులు మా
వాయసనివహముల యొద్ద వని వడవుగ, గో
మాయుఁడః చిక్కు వడితి; వీ
కాయము గాయంబు పేయఁ గల వాఁడ నీకన్.

ఆవుల బెదరించుటయున్
వావిరి పైత్యాధికమున వదరు కొనుటయుం
గావరమున ధూర్తకృతుల్
గావించుటగాదిది, పొలికలనుర నక్కా!

అని నిరసించుచు, వెనుకొని యుమవముక్కువం బొడువసాగె.

కాకి యొకఁడు ముందుగా నిల్చి కవ్వింప
వెనుకఁ జేరి పొడుచు వేఱొకండు
కంటఁ బొడుచు మోముగందఁగాఁ బొడుచును
వెనుక పొడిచి ప్రేగు వెలికి లాగు.

ఇక్కరణిఁ జిక్కులం బడిన నక్క యొక్క యుపాయం బాలోచించి—

అత్తరిఁ దత్తర మందుచు
నెత్తిని ధర మొత్తి, వెన్ను నిగిడిచి, తిత్తుల్

దుత్తుమురు గాఁగ నొత్తిన

(దుర్వాయువు వాయవ్యాస్త్రంబు పగిది విజృంభించి భూ నభోంతరంబుల నాక్రమించి ముగుపుటంబు లగల్చిన సహించి నిల్వ నోపక) —

బిత్తర పడి కాకిమూఁక విన్నుం బ్రాకెన్.

అట్టియెడ హయంబును నిలువరించి గ్రద్ద యిట్లనియె—

ఇకిలింపక సకిలింపక
కకపికలును గాక గృధ్రగణములతోఁ బో
రికిఁ గడఁగి ప్రాణములతో
సుకరముగాఁ దిరిగిపోవు సుకృతము గలదేః

అని రజ్జులాడు నెడ గుఱ్ఱము తెలివి మాలి సకిలింపసాగెనంత రామబంధువు వృషభంబున కభిముఖం బై

అంకెలు వేసిన యట్లే
కొంకక నిలు గాలుగుదిరి కోడె తనంబుం,
బింకము పోటుఁ దనంబును
బొంకము గ్రక్కుంతు మిగిలిపోకు పసరమాః

అని తూల నాడిన నెద్దు భయముచే నిలిచి మూత్రము విడిచె. అయ్యెడ మఱియు నొక కాకంబు మేక పోతు నాలోకించి—

మేఁకపోతు గాంభీర్య మీ కొకుల కడ
సున్నపాకుఁ దొడిమకు నే నెన్నరాదు
ఆకు మేసి తపించి ఈ యవని నెంత
నీ పఱత్వము గైకొని నెగడి తేని.

అని మేఁకను గేలిసేయుచు వెంబండించి పొడువం దొడంగిన రక్తము కాల్వలై పాఱ, బాధకు సహింపలేక మేఁక "బేబే" యని యఱచి పఱచుచుండె నట్టి యెడ దూడబొతు పొట్టేలి మొగ్గంబు దిక్కై—

కొమ్ము లెంతగఁ దిరిగిన గొఱ్ఱెపోతు
పేగద, యొడలు మఱచి గర్వించి మించి
కొండ తోడను తగరు డీకొన్న పగిది
మాపయిం గత్తిగట్టఁ బ్రమాద మొదవు.

అని గొఱ్ఱె మేని కండలు చీల్చి భుజింపఁ దొడంగె, నప్పుడు సూచీ ముఖంబు శునకంబును ధిక్కరించుచు—

చెప్పు దెబ్బ దినియుఁ జెప్పు నోటఁ గఱచు
కొనుచుఁ బోవు నీదు కుక్క బుద్ధి
మాను మింక నేని మర్యాద నెఱుఁగుము
స్థాన బలము లేదు తగ్గి మొఱుఁగు.

అని సూది ముక్కుతోఁ బొడువం దొడంగిన దాని చుఱుకు భరింప లేక మొఱుఁగుచు భైరవుండు—

చెవులు రిక్కించి ముట్టెను మివుల సాచి,
మొఱ్ఱు కుంచించి. పండ్లను వెళ్ళబెట్టి
తోఁక ముడిచియు, నెదురొడ్డి బూకరించి
భయద భైరవ విశ్వరూపంబు సూపె.

అది గాంచి సంభ్రమమున సూచీ ముఖంబు విముఖంబయ్యె, నంత గండ భేరుండము మనుబోతుం డాసి—

నెత్తిపైఁ గొమ్ము మొలచిన నిన్నుఁ గన్న
మదరు చెందునే యిరువాతు లున్న పులుఁగు
తరలకను నిల్వ, మనుబోతుతనము మాన్ప
కునికి నను గండభేరుండ మనకు మింక.

అని మనుబోతును డొక్క వ్రయ్యలుగాఁ జించి చెండాడ సహింప లేక మన్ను నేల కొదిగి మన్ను గఱచె. ఇవ్విధంబున పౌలికల నెల్లఁ బీనుంగుపెంటయై మహాభీభత్స మయ్యె. పురుగుపైఁబుట్ర యన్నట్లు సత్త్వసైన్యమునకు మఱి యొక్క యిక్కట్టు దాపురించె.

చపలబుద్ధి నిల్వఁ జాలక నొక్కచో
నెమ్మ లేరి తినఁగ నేగెఁ గుక్క
యదనెఱింగి గ్రద్ద లతిరయంబునఁ దన్ను
కొనుచుఁ బోయె నెఱచి కొదువ పడఁగ

పశువులట్లు విచ్చెఁ బలలంబు లేమిచే;
మృగచయంబు నొచ్చె మిక్కుటముగ;
ఖగచయంబు హెచ్చి గారింపఁగా జొచ్చె
సత్త్వ జాలములను చలము పట్టి.

చంచూపుటంబులఁ జించి వైరులఁ జెండి
రక్తంబు మై బూసె రామబంధు.
పెకలించి బలిమిమై ప్రేవుల గృధ్రంబు
కంఠహారమ్ములుగా ధరించె.

పీరవిహారంబు వెలయించి బర్హిణం
బహుళశిరోమణి యపహరించె.

గండ భేరుండంబు గండరగండడై
కోడెల కొమ్ముల నూడఁ గొట్టె,

ధ్వాంక్ష మాక్రోశమున రేగి వారువముల
మాడుబొచ్చెల్లఁ గడిమిపై యూడలాగె.
అట్టి యెడ సత్త్వజాలంబు లాగ లేక
ముచ్చముడిగి, చీకాకయి విచ్చఁబాఱె.

ఇట్లు కాందిశీకులగు తమ బలంబులం గనుంగొని సేనాపతియగు వ్యాఘ్రపతి—

ఏరిఁ జూచిన సేనిఁక, ఎద్దు, ఎనుము
పోతులును, మనుబోతులు, పులులు, నెలుఁగు
బంట్లు, జివ్వంగులై మనబలము లెల్లఁ
బక్షి సముదాయములఁ జూచి పాఱు టేల!

అని సత్త్వగణపరాజయంబునకు మనంబున నాశ్చర్యంబు నొంది తమవారిం జూచి,

చూతు రేటికి వెనుకొడఁ జూతు రేల!
ఖడ్గ! మహిషుఁడ! కొర్నాసి! కపి వరుండ!
రంతు! గదియుఁడుసంగర రంగమునను
నిలిచి గండడగింపుఁడు నిక్కు ద్విజుల.

పందివై క్రొవ్వి, పిఱికివై పాఱెదేల!
ధైర్యమెడ యైనఁ, గండ లెంతగను నున్న
లాభ మిసుమంత లేదన లక్ష్య మిదె;
యేల నీలావు కాల్పనే యేకలంబ!

కొండవలె నున్నఁ గొమ్ములు గొరిజలున్నఁ,
దోఁకయును తొండముండిన, దొడ్డ బుద్ధి
కల్గనే పూరి గఱచెడి గజమున కిలఁ?
కరటి! నీ పేరు తగ సార్థకతను జెందె!

పుంగవుఁడ! యేది! నీ దైన పోటుతనము?
పోత! యెటఁ బోయె నీ మడ్డి పోతరంబు?
ఎలుగుబంట! నీ మొండి పట్టెందుఁ బోయె?
రండు! పోరఁగ సంగ్రామ రంగమునకు.

పాఱినఁ దప్పదు మరణము;
పాఱిన దుర్యశము నిలుచు; వారక నవనిం
బాఱకయె నిల్చి గెల్చినఁ
బేరొందవును; స్వర్గ మొదవు విడిచిన నసువుల్.

ప్రాణములం దెగఁ జూచిన
ప్రాణులకును గాని కార్య మవనిం గలదే?
దేనికి బలిసిన కండలు
జానగు పౌరుషము జూపఁ జాలక యున్నన్?

ఆరంభశూరత యే యది,
ఆలును సత్వరమ్ము, జంకు వందెద రేలా:
వీరలు పక్షులు నిలుతురె?
పాలిక వాకసముఁ బట్టి భండనమందున్ ?

ఒనర దైవజ్ఞులు శుభంబు నూదిపలుకఁ
బక్షిశకునంబు వెగటుగాఁ బలికినారు.
పాటి యగు నోటు శకునాల పక్షి మాట
లెక్క సేయక ధృతిఁ బూని లెండి యనికి.

అని యివ్విధంబున,

అందఱఁ బూరి కొల్పినను
వెందియుగక సాధుసత్త్వవితతులు బోఁగా
వందలి వన్యమృగంబులె
యందందున నిలిచి పోరి రా పులిదండన్

సందడి కయ్యం బయ్యెను;
సందెలునున్ మాటు మణిఁగె;జాలిక వని, మీ
మందిరములఁ జేరుండని
దందడి డప్పులను గొట్టె చద్దరవితతుల్.

ఖగచయము లొకరి నొక్కరు
పొగడుచు దురమునఁ దమతమ పోయిన బోకల్
మగటిమిని బలుకుకొనుచును
గగనంబున వివిధగతులఁ గలకలఁ గూసెన్.

ద్విజుల గెలుపుఁ జూచి ద్విజరాజు షోడశ
కళల తోడఁ మార్పు కడను దోఁచె
కళల నాని వారు కవులునై, ఖచరులై
దివ్య పురుష లట్లు తేజ రిలిరి.

మృగచయము నేలఁ జూచుచు
మొగములు గడు చిన్నవోవఁ బొధలం బడియెన్,
మృగ నాఁధు డేమి తోఁపక
వగలం బొగులుచును మంత్రివర్గముఁ జేర్చెన్.

వారలం గనుంగొని రాజ సింహుఁడు—

పక్షిబలము నెట్లు భంజింపవలయునో
చిత్తమందు మీరు చింతఁ జేసి
ఎఱుఁగ బలుకుఁ డనిన నెంతయుఁ బ్రొద్దును
తలఁపు చేసి చేసి తరము గాక.

భూరిమాయుఁడు మినుసూచె మోర యెత్తి
పిల్లి మిన్నక గోళులు గిల్లుకొనియెఁ;
దలను వంకించె నురక యూధపతి; హరియు
దెసలఁ జూచుచు నకిలించెఁ దెలివిమాలి

పెద్దపులి నేల మూర్కొనెఁ బెద్దప్రొద్దు;
యాలి కెది మది దోఁప కుయ్యాల లూగె;
రాజసింహుఁడు చూచి వారల తెఱంగు
మిన్ను విఱిగిన చందమై మిన్నకుండె.

ఇంతలోఁ జీమ చనుదెంచి యెఱఁగి రాజ
సింహునకు బ్రక్క కొదిగి నిల్చిన నెఱింగి
"మంత్రిసంఘము తోడను మంతనంబు
సల్పు నీయెడ కీవు రాఁజనునె?" యనిన

చీమ నగి యిట్టు లనియెను సింహమునకు—
నెఱుఁగు దేను మీ మంతనం బెల్ల రాజ!
దానికి నుపాయ మొక్కటి తలఁచినాఁడఁ;
జిత్తగింపుఁడు విజ్ఞప్తి చేసికొందు.

పట్టిన పట్టు వీడ కొకపట్టునఁ గుత్తుక ద్రుంగి పోయెనే;
నెట్టన సూర్యమండలము నేము హుటాహుటి వ్రీల్చి వోదు; ము
ట్టిట్టనరాని పూనికి వహించి సమస్త దిశావకాశముల్
ముట్టిన కీర్తి తెల్లముగ మొల్లల మల్లెలఁ గొల్లలాడగన్.

కొంచెపువార మంచు మముఁ గొంచెపుఁ జూపును జూచి కించ గ
ల్పించుట పాడి గాదు; పనివించిన మానవ జాతి కొంపలన్
ముంచెడి పాటి వారలము; మూఢత నోడక మానగళ్ళఁ గా
లించక యుద్ధపాముల వధించి కడింది యశంబు గాంచమే ?

మాలోనఁ దెల్లవారలు
కాలూనుచు మోము నెత్తి గావించునెడం
బోలుం గని నేల పయిం
గూలు గుభిల్లు మని నరుల కొంపలు వరుసన్.

అట్టిపుట్టును నానవాళ్ళన్ని యెఱిఁగి
శుంఠి శోధించి మానవశుంఠ లెందు
దాఁచియుంచిన యర్థంబు దోఁచి తెచ్చి
పుట్టకోటను బెట్టెడి జెట్టి యితఁడు.

మఱియు మాలోన "ఔజ్గాసు" జాతి వారు—
కలుపుదీసి, క్షేత్రము విత్తి, కసవు పెంచి,
పంట పండించి, పురువుల నంట నీక
రక్షణము చేసి గింజల రాల్చి బయల
భూబిలంబులఁ బాతరల్ వోసి యుంత్రు.

పంతెనలు గట్టి, మార్గముల్ సంతరించి
యాకురసమున "సిమ్మెంటు" లమరఁ జేసి
పట్టణంబులు కడు వృద్ధి పఱచువారు
పాడిఁ పంటలఁ దులఁదూగువారు వీరు!

వెలయ మనుజులు పశువులం బిదుకునట్లు
పితుకుదుము పాలు కీటకవితతి మేము
బానిసలు గాఁగ నొరులను బంది జేసి
పనులఁ గొందుము మనుజులపగిది మేము.

వానరాకడ ప్రాణము వాయుటయును
ధీరులగు మానవులె ధాత్రిఁ దెలియ రేమొ !
వాన పట్టుటఁ గని గ్రుడ్డు బూని ఱెత్తి
భద్రపఱతుము తెలియుమా ! ప్రతిభ నింక

అది యట్లుండ,

కలదు పశ్చిమమున నాఫ్రికా యనంగ
ఖండ మొక్కటి చీఁకటి ఖండ మనఁగఁ
జెల్లు నది దుర్గమారణ్యసీమ యగుట
సూర్యకిరణ ప్రసారంబు చొరఁగ రామి.

మధ్య భాగంబు నిర్జనమండలంబు
సరిగ భూమధ్యరేఖపైఁ బరగుచుంట
భయదమౌ భీష్మగ్రీష్మాతప ప్రసరము
భూరితర నిరంతర వర్షములు చెలంగు.

అ మహారణ్యసీమల యందుఁ గలుగు
వృక్షముల యెత్తు నొత్తు వర్ణింప వశమె !
అవి లతాగుల్మపుంజముల్ దవిలి పెనఁగఁ
దరియ రాకుండు జంతుసంతానములకు.

ఇంద్రు నైరావణంబని యెన్నఁ బడెడి
తెల్ల చౌదంతులందు వర్తించు దెసల
సింహములకంటె భయదమై చెలఁగునట్టి
వానరములు గొరిల్లాలు వరలు నచట

ఎట్టయెదురయి మానిసి నెక్కి త్రొక్కి
కోఱలను గీటి ర క్తంబు గ్రోలి నిండు
ప్రాణములఁ దీయఁ జాలినవారు గండు
చీమ లున్నారు నిక్కము సింహరాజ !

అట్టిడులకు నీ పక్షులఁ
గొట్టి దురంబున జయంబు గొను టొక లెక్కా !
యొట్టిడు కొందును రాజా !
పట్టి ప్రగల్భములు గావు వాస్తవమిది సూ !

తురగములఁ గురంగములను
త్వరగాఁ గొనిపోవ నాజ్ఞ దయసేయుఁడు, నే
దురమునకుఁ దెల్లవారక
నరుదెంతును గండ్లతోడ నని వచియింపన్—

మహాద్భుతానందముల నొంది తత్క్షణంబ—

మృగరాజు నట్లు నలిపెను
మృగ చయములు, తురగ ఘటలు మీఱి సమీదుం
గగనమునఁ బాఱఁ జొచ్చెను,
మృగమువయిం జీమ త్రోవ మెలకువఁ జూపన్.

అంతఁ బశుగణ మెల్లను హరివరేణ్యు
పాదపద్మంబులకు మ్రొక్కి ప్రక్క కొదిగి
మొగమునందు దీనత్వము మొలకవాఱ
భక్తి వినయంబులను జూపి పలికిరిట్లు

"పొదలలోవలనో మఱి బొరియలందొ
పవలు గనరాక దాఁగెడి వంచకుండు
బొందలను త్రవ్వుకొని తిను పోతునక్క
నాయకుండయ్యె మాకు వినాయకుండు.

పశువులు, మృగములని భేదభావ మూని
పక్షపాతముచే మమ్ముఁ బఱచినట్టి
వంచకుని నాయకత్వము వలన నిల్వ
మాకు సాధ్యము గాదు సుమా! మృగేంద్ర!"

అని విన్నప మొనర్చుకొనినఁ జెంగట నున్న వ్యాఘ్రపతి కటకటఁబడి రాజ సింహాన కిట్లనియె. "నిన్నటి మన పరాజయంబునకు ముఖ్యకారణంబు నిదియ. కావున దక్షుఁడైన మఱియొక్కని సర్వసేనానిగా నిర్ణయింపవలసి యున్నది.

సాధుమృగములు కాదన్న చందమేల?
నితఁడు మార్జాలుఁ డింద్రమహేంద్రజాలుఁ
డమిత ధీశాలి, యెంతకు నైనఁ జాలు
ధైర్యనిధి వీని గైకొనం దగును మీకు.

పులి ప్రసన్నాకృతియె పిల్లి బుద్ధిఁ దెలియఁ;
దెగియెనేని మహోగ్రతం దేజరిల్లు;
నెంత కార్యము గాని గావించఁ గలఁడు;
మమ్ము మించిన విద్యాక్రమమ్ము లెఱుగు.

చీఁకటేని జూచు చెలువైన కన్నులు;
'పిల్లి కంటి తాలఁ' బేరువెట్టు;
తీయ మూయ నైన తీరైన గోళ్లు;
కులిశములకుఁ బిరుదు వలుక వచ్చు.

పరుల కెఱుఁగ రాని పద చమత్కృతి వైరి
హృదయ శల్య మగుచు నుదటు గూర్చు.
ఇట్టి ప్రజ్ఞలెల్ల నిల సహజంబుగాఁ
గల్గు పిల్లి కంటె గండె వండు?

అని వచించినఁ బులిపలుకులకు సింహమచ్చెరువంది వానిందేటి చూచి—

పిల్లి వైయుంట నింత గావింప గల్గు
దని యెఱుంగక మోసపోతిని, బిడాల
వంశవార్థి చంద్రమా! వలదు నాక
యూను మికార్యమునకు నీ వోపగలవు!

అనిన మృగరాజు మాటలకు దద్దయు సంతసించి పెద్దపులియు సాదరంబున, బిల్లిని డాసి, యిట్లనియె—

పెద్దపులి యటంచును పేరు పెద్దగాని
పెద్దవీవౌదు సంగ్రామ విహరణమున;
మఱియు నైన వాడవు మేనమామ వీవు
సర్వసేనాధిపత్య మొసంగఁ దగుదు;
మొదల నీకీయ కుండుట కొదువ గాఁగఁ
దలఁపకుము రాజభక్తి తత్పరుఁడ వీవు.

అని యగ్గించిన మార్జాలంబు వినయవినమితోత్తమాంగుడై యర్థ నిమీలిత నయనంబులతో నిట్లనియె—

పులులు జివ్వంగు, లేనుగుల్ పుంగవములు
ఖరులు, మహిషులు, వీర శేఖరులు గలుగ
సర్వసేనాధిపత్యము నలుప నొక్క
పిల్లిఁ గోరుట నా భాగ్య విభవ మేమి!

తగుదునొ తగనో యెఱుఁగను;
తగు మీ యనుమతియె నాకుఁ దప్పనిసరియౌఁ;
దగుదని మీర లొసంగఁగఁ
దగుదునొ? తగనో? యనెడి వితర్కములేలా?

అని పిల్లి యనుమతించిన
వెను వెంటనె సర్వ సత్త్వ విపులాంగములం
గొనుమనుచుఁ బట్టభద్రుని
గను సలిపెను రాజు మంత్రిగణముల తోడన్

అట్టి యెడ నవకాశవాదియగు గబ్బిలంబు—

ఱెక్కలు గల వారలతో
నెక్కరణిని బోర నేర్చు నిల సత్త్వంబుల్
నిక్కంపు బలిమి కలుములు
వెక్కొను కయ్యమున నిన్ననే కనుపట్టెన్.

గెలుపు నిక్కమనుచుఁ దెలియవచ్చెను గాన
నభ్రచరులలోన నగుదు నొకఁడ
ననుచు నాత్మఁదలచి యవ్వారి శరణంబుఁ
బడయఁ గోరి రామబంధుఁ జేరి

మీ యందున్ మన మ్ముంచి యీ యెడకు నెమ్మిన్ వచ్చియున్నాఁడ నే;
నా యందున్ కృపనించి భృత్య హిత సన్మానంబులం గూర్పలే
రాః యింతే సుమిః యింతకు న్మిగిలి బ్రహ్మాండంబునేఁ గోరఁ;జో
ద్రోయం జెల్లదు వీని, దీనజనబంధూః రామబంధుప్రభూః

ఇలపై గాలిడ, ఱెక్కలు
గలవాఁడను చెట్లయందు గట్లను నెందేఁ
దలక్రిందుగాఁ దపింతును,
కులమున నే ఋషిసమాఖ్యకుం దగువాఁడన్.

లౌకిక మెఱుఁగని వైదిక
మేకాంక్షిత మగుట మాకు నెఱుఁగం బడవే
యీకల తోకల జోకలు
చేకానుమాః షాత్వికుని విశేషఫలంబౌ.

పలికిన యీ పలుకులలో
పల మృష గల్గిన దివాంధపరతంత్రుఁడనై
తలక్రిందుగ వ్రేలుదు నే
చెలువేదిన పాడు గుళ్లఁ జీఁకటి యిండ్లన్.

అనుటయుఁ గాకి యాపలుగాకి గబ్బిలంబు పల్కు లాకర్ణించి విస్మయము నొంది, రామబంధునిం జూచి—

జడ్డు మొగము, గ్రుడ్డితనము, మడ్డితనము
విడ్డురంబగు తలక్రింది జడ్డ బ్రతుకు
దిక్కుమాలిన దిది యొక్క పక్కి గలదె!
అక్కజంబిది నామది కెక్క దింత!

తను వెల్లను దుర్గంధము
కనఁబడ దొక యీఁక యేని గాలించినను౦
గనము విన మెప్పుడున్నను
మన ఖచరుల నిట్టివాడు మహిఁ గలుగుటయున్

ఏపురాణమందు నే శాస్త్రమందును
నెవ్వ రెచటఁ బలుకు టెఱుఁగ బడదు.
తోఁక లేని పక్షి దోఁచు నిక్కాలి నని
కలుగునేమొ ఘోరకలిని ముందు!

అని పలికి తెల్లనోటి తైలపాయిం జూచి, "ఓయీ! తోలు తెక్క, లల్లాడఁ గల్ల లాడెదవేల?

అకు లలములు, గాయలు నాహరించి
యద్రిగుహలను నివసించు నట్టి ఋషుల
మనుచుఁ బలుకుదుఁ తలక్రిందులైన నుడుల;
బులుఁగు నారాని చెట్టకుఁ బోదు వీవు."

అనిన ఋషిపక్షి కాకినిం గనలి చూచి—

ఒరులఁ గంటఁ జూచి యోర్వఁ గల్గుదువె, నీ
వొంటి కంటి పక్షి యూరకుండు!
పీన్గు పైని వేయు పిండాశనంబుల
నేరి తినెడి నీది యెంత బ్రతుకు?

పదవి గలిగినంతఁ బైకెక్కి కన్నులు,
కులము గౌరవంబు కొంతవఱకు
నెఱుఁక వఱచి తిట్టు లే మాత్ర మొదవిన,
గొంచెపాటి బుద్ధి గొడవసేయు.

జగము తల్లి యైన జానకి చను గీరి
రామభద్రు నస్త్రరాజమునకుఁ
గావ్క పెట్టితి వొక కనుజూపు, తూరుపు
జూడ పశ్చిమంబు నుడియును గద!

అహహ! నీ రాజసమునకు వదియుఁ జెల్లెఁ
బూర్ణగర్వాంధతకుఁ దోడు పుణ్యవశత
సత్య నేత్రాంధతయును బ్రశస్తము గద!
కాకి! నీ ప్రభావము నెంతగా వచింతు!

ఋషి కులంబు వారి రేపెట్టి శాపోక్తు
లందఁజూతువేల యలఁతికాకి!
సాధుకోప మవని సర్వంబుఁ బరిమార్చుఁ
దర్క మేల నీకుఁ దగ దుడుగుము.

అనిన విని రామబంధువు తగ వుడిపి కాకి కిట్లను—

ఆరంభమునవనె శాపం
బారంభంబయ్యె మనకు నది యెట్లగునో!
వేరంబు లేల పొడవుడఁ ?
గాఋలు కొఱగావు సాధు గణముల పాలన్.

అని వెండియుం బై లపాయికిం గేలు మోడ్చి—

ఋషికుల తిలకా! విను, నీ
విషయంబున సందియంబు విడిచితి; నీ పౌ
రుష ముడిగి కావుమా! సఖు,
సుషమాపరిపూర్ణహృదయ! సురుచిరసదయా!

అవి ప్రార్థించి తన కడ నుండ నియమించె నంత—

రేయెల్ల గస్తు దిరిగిన భైరవభటుల్
కుటజముల మొదళ్ళఁ గునుకుచుండఁ
గోడినిద్దుర నుండి కూసి జాములఁ దెల్పు
కుక్కుటంబులు మేలుకొలుపు చుండ
నొక కన్ను దెరచియు నొక కంట నిదురించు
యూధపుల్ గనువిచ్చి యులుకుచుండఁ
బాల్జేపుకొని రాఁగ బాలవత్సములకై
"యంబా" యనుచు నావు లఱచుచుండఁ

జీఁకటులు చెట్లనీడలఁ జేరి చరమ
దిక్కునకుఁ బాఱ, జుక్కలతేజ మాఱ,
మలయపవనుండు గుజ్జుకొమ్మలను దూఱి
చల్లగా వీవ ఘల్లునఁ దెల్లవాఱె.

ఉభయసేనల యూథపు లొక్కమొగిని
వ్యూహములఁ దీర్చి నిలిపిరి యుత్సుకతమ
నొండురుం దాఁకి పోరాడుచుండి రపుడు
చలము సూపఁగ సంకుల సమరమయ్యె.

రాషమృగేద్ధ విక్రాంత్యభిరామత
లక్ష్మణ సముదగ్ర లక్ష్మణతయు
వ్యాఘ్ర నాయకమణి యతి విభీషణతయుఁ
గెరలు కపోతసుగ్రీవతయును

భల్లూకపతి భూరిభల్లుకేశ్వరతయు
వానర ప్రవర సద్వానరతయు
గంధమాదన బృహద్గంధమాదనతయు
నీలకంధర గళోన్నీలతయును
రాజహర్యక్షలోక విద్రావణతయు
కరిమహాంగుల యతిమహాకాయతయును
తనరు పేచకఘనశాటవత, రణము
రామరావణసంప్రహారంబు వోలె.

సూర్యమండలంబుఁ జొచ్చిపోఁగల యట్టి
శూరు లెవ్వ రిందుఁ జూత మంచుఁ
జేరవచ్చె ననఁగఁ దూరుపు కొండను
సూర్యుఁడెక్కి నిక్కి చూచుచుండె.

అంతఁ బిపీలికా యత్నంబు సఫలంబగుడు—

కొండల తరబడి గండులు
వెండుగఁ దమ యెడలఁ బ్రాకి నిలువం బడఁగా
గండొకఁడు తమ్మి నడుమఁ బ్ర
చండతఁ జనుదెంచె హరిణ సైంధవ ఘటలున్.

వచ్చిరి, వచ్చియు రాకయె
జొచ్చిరి, సమరాంగణమునఁ జొచ్చిరి పోరన్,
వ్రచ్చిరి రిపుసముదయముల
ముచ్చిచ్చుల పగిది వారు ముమ్మొనలుగనై.

మ హొ కొ లీ న మః

పిరు దివియరు గలఁగరు తొలఁ
గరు నిరు వాహినులయందుఁ గలవీరులు; నొ
క్కరి నొక్కరుఁ, జలమునఁ బె
క్కుర నొక్కరుఁ దాకి పోర ఘోరాహవమై.

అట్టి యెడఁ బక్షి సముదాయముల,

పలు విధాల విపుల పక్ష ఘాతంబులఁ
దవిలి మూర్ఛఁ బుచ్చఁ దాఁకు వారు
చాకచక్యముగను చంచూనఖా మోఘ
సంచయములఁ జీల్చి చంపువారు

మఱియు సత్త్వసముదయముల,

గర్జనంబు సల్పి గాండ్రించి తీండ్రించి
ఘీంకరించి మించి కెరలువారు
గుఱ్ఱు పెట్టి పెట్టి గుప్పించువారును
చెంగలించువారు సిద్ధపడిరి.

చూపఱ గుండెలు చెదరఁగ
నేపడఁగును ఖచరసత్త్వ మీ నాఁటన నం
జూపట్టె నేమి సెప్పగ!
నా పట్టునఁ బెద్ద ప్రొద్దు నవ్వల జరిగెన్.

# పిపీలికా విజృంభణము:

పుడమి యీనినట్లు పుట్టలు పగిలెను
గండు చీమ లెల్ల కదలఁ బ్రాకి
పక్షి గణముఁ బట్టి పల్లార్పఁ జొచ్చెను
నిలువ నీయ కొక్క వెలవు నందు.

ఒడుదొడుకు తెక్క చీమలు
సుడి దిరుగుచు లేచిలేచి చొరఁ బాజీన యా
సుడివాలు సుడిసి నట్టులు
పడి మూర్ఛలు చెందు చుండెఁ బక్షి వ్రతతుల్

పొమ్మిగాను క్రమ్మి ముమ్మరమ్ముగ దేహ
ములను వ్రీల్చి రక్తములను పీల్చి
ఒప్పఁ జేయు గండ్లు చెప్పఁ జాలని యంత
ముప్పు గూర్చు చుండె నప్పు డచట.

బారులు గట్టిన చీమలు
తోరముగాఁ బక్షివితతిఁ దొలువం దొలువం
పారెను రుధిరావగలుం
ఘోరముగా యుద్ధ భూమిఁ గూలిరి వారల్.

చక్రపర్యటనంబున నాక్రమించి
గండ్లు విక్రాంతిని తుపాకి గుండ్లవోలి
పక్షి పక్షమూలంబుల పట్టులందు
కోటలను మీటి రక్తంబుఁ గ్రోలఁ దొడఁగె.

పక్షమూలములను పరికించి "టూపీలు"
సందుఁ జేరి మూల మందు నుండు
విసపుగ్రంధి నుండి విసమును విరజిమ్మి
పక్షపాత మందు పనిది పేయుఁ

అట్టియెడ "ఫార్మపీనా" చీమలు

కాళ్ల నేల దన్ని కదలక నిలుచుండి
వెనుకభాగ మెత్తి విసముఁ జిమ్ము
విషపుగ్రంధి నుండి "పిచికారి" గావించు
విధము దోఁపఁబకీవితతి పైని.

రెక్కల పస గలవా, రిరు
ముక్కులు గలవారు, కత్తిముక్కుల వారల్,
చక్కని నిడుముక్కుల వా,
రుక్కును గైకొనని ముక్కు లొప్పిన వారల్

ఉక్కు దక్కి దిక్కు దెలియక చెల్లచెదరై పోయిరి.

ప్రళయాంతముగ నార్చి పరిపంథులను హరి
పాఱిన వెన్నాడి మారి మసగె;
గళ రక్తములఁ గ్రోలి గజ్జు మంచును ద్రేపె,
ఢీంఢ్రించి క్రోల్పులిభండనమున,
కరకరియై యట్టె కరమున మెలిబెట్టి
నేలఁ బెట్టి ద్వీపము కాల మట్టె;
హుమ్మని ఢీకొని కొమ్ములతో గ్రుచ్చి
పచ్చడిగాఁ ద్రొక్కెఁ బసరు కోడె;

ఖరుడు దాఁచెను ప్రాణముల్ గడను ముట్ట
క్రొమ్ములాడెను నెనుబోతు ఱొమ్ము లగల;
పశులు రిక్కించి లంఘించెఁ గటీవరుండు;
తగరు పొగరున వెనుకొని తాఁకి పోరె.

పెళ పెళ నెమ్ములు విఱిచి ముక్కలు చేసె
కాలభైరవుఁ డయి కడిమి వేఁపి
ఉక్కురోసంబున డొక్కలు చీలిచి
పెద్ద ప్రేవులఁ దోడె ఫేరవంబు.
కఱ కఱ గొంతులు కొరికి తుండెలు జేసె
సాహసంబునను మార్జాలవిభుఁడు,
తొలిచి నెమ్మేనులు తొఱ్ఱలు గావించె
గండర గండఁడై గండు చీమ.

కాలసర్ప ముగ్రమ్మున గస్సుమనియె;
వశులను నిప్పుకలు రాల్చె ఋక్ష విభుడు;
పట్టియెడ నిల్వరింపఁగా నలవి గాక
పశు లాదట నూదని బాడ జొచ్చె.

అట్టియెడ భైరవుండు వైరిహృదయ నిర్భేద భయంకరార్భటుల నెమ్మిని నిలువరించి—

నట్టువ పిట్టా! నిలునా
యెట్టయెదుట నరనిమునమునే, నీ వన గ
స్పట్టఁగఁ జేతను పాఱకు
కట్టేఁడి! యేదాట లాడఁగాఁ జేయుదు నిన్.

అని యెకసెక్కెముగాఁ బలికిన మయూరంబు బిట్టవిసి పుట్టెడు పరాభవముతో నొక చెట్టుపైకి లంఘించు నెడ సారమేయంబు దానితోఁకం గఱచి పింఛంబు పెఱికె. అంతలో బిడాలంబు కుక్కుటంబును దరిసి—

పుంజువొ! పెట్టవొ! దేలుతు
నంజను వెనుకాడ కుంటివా యిపుడే నిం,
బుంజువ యేని న్నిలువుము
రంజన పెడ బ్రతుక నేలరా! పీవనకున్?

అనినం దొలంగ లేక ముంగాలు, వెనుక చూపుగా నుంచు నెడఁ, బిల్లి యొడిసి దాని జుట్టుగొఱికి గడ్డముఁ బెఱికిన, శృంగభంగమై తొలంగి యుఱికె. అంత నమ్మార్జాలుండు శుకంబు నెదుర్కొని—

ఎఱ్ఱ మొగము చేసి యెంతమాటేనియు
నెదిరిఁ బలుకునట్టి యెగిరిపాటు
నడఁచి "రామరామ" యనిపింతు నీనోట
గొంతు గఱచి పట్టుకొంటి నేని.

అని పరాకున నుండ లాఘవంబునఁ బైకి లంఘించి కృతప్రతిజ్ఞుం డయ్యె. అయ్యెడ వ్యాఘ్రంబు శీఘ్రంబున ముందునకు దూఁకి—

పలుగాకులార మిమ్ముల
పలు భంగంబులను బెట్టి బరిమార్పని వోఁ
బిలువుండు మాఱుపేరునఁ
బలువురు గలవార మనుచుఁ బలు గూయకుఁడీ !

అని కాంద్రు కాంద్రు మని తీండ్రించిన, మహాసంక్షోభంబునం గాకు లెల్ల వికావికలై యాకసంబునం బఱచె. అట్టియెడఁ గుందేలు పికంబు ముందు నిలిచి, నిరోధించి—

కాకులచేఁ దన్నులు వడు
కోకిలవా వగరు చిగురు కొఱికెడి వాఁడా!
నీకేల యిందు వచ్చుట
కూకలొ! పాటలొ! యిట రణ కోలాహలముల్.

అని గేలి చేసినఁ జేయునదిలేక యెఱ్ఱగనులతో, నుడుకు మనంబుతో, నది తొలంగి చనియె. అంతఁ గొంగను ముంగాళ్ల నెదురొడ్డి మేఁక యిట్లనియె—

రానే వచ్చితి వాహవంబునకు, నీ ప్రాణాలతో నా వలం
బోనీయం గలవారమే? బకజపంబుం జేసినం గొక్కెరా!
నీనేర్పుల్ ఝషసంఘముం దవిలి పోనీకం గ్రహింపందగుం
గానీ, మాపయి నెత్తిరాఁ దగునె? నీకాలంబు ప్రాప్తించెఁ బో!

అని మహాగంభీరంబుగా నుడువ నేమియుం జేయునది లేక బకంబు వెఱచి పఱచె.

సత్త్వసైన్య మెల్ల చలపట్టి పెన్నాఢ
గగన చరుల కెల్ల గగన చరత
సార్థకంబునయ్యె, శరణంబుగా నయ్యెఁ
బక్షయుగము నెల్లవారలకును.

గ్రద్ద యుచ్చగతిని గడ చన లేకుండె;
బెద్ద తనము పోవ వెఱచె గూబ;
గొంతు నీయఁదలచి కుక్కుటేశ్వరుఁ డుండె;
గుండె జాయి చేసెఁ గొక్కరాయి.

తెల్లమొగము వేసెఁ దేకువ పెడి యంచ;
డేగ ప్రల్లదములు డిల్లవోయెఁ,
కాకి యఱపు లెల్లఁ గడు నన్నగిల్లెను;
గోరు వంక పొగరు కొఱత పడియె;

పరిగపిట్ట లవెల్లను పరుగువాఱె;
పావురారేని ప్రఢిమంబు పలుచవాఱె;
చక్రనిర్వక్ర విక్రాంతి చల్ల పడియె;
కాలకంఠుని యుద్వృత్తి కలఁత పడియె;

గండు చీమలు నిరుదెసఁ గలసి రాఁగ
సత్త్వసైన్యము కార్చిచ్చు చంద మంది
క్రమ్ముకొనఁ జొచ్చె ద్విజుల నుగ్రమ్ముగాఁగ
నొగిఁ దలపండి కంకణ వ్యూహమునను.

వాయసుని మోస పుంబని వలనఁ జేసి
కలరవంబులు నాగరికంబులైన
పులుఁగు లెల్లను వెలుపటి వలనఁ దోఁచె—
వేఁటరుల వెల్లి లోపల మాటు వడియె.

మాటలాడువారు పాటలు పాడెడి
వారు గండు బిల్లి వాతఁ బడిరి;
ఆటలాడువారు నందాల చందాల
వారు గండు చీమపాలఁ బడిరి.

కలరవంబు లెల్లఁ గలవరంబును జెంది
కాకి తంత్ర మెఱిఁగి వీక దఱిఁగి
చేయనేమిలేక కాయముల్ గాయముల్
గాఁగఁ భీన్గు పెంటగాఁ దొడంగె

నాగరికుల పాట్లు నాగారులును జూచి
గండ్ల నెదురు కొనఁగఁ గరము బెదరి
చూచి చూడనట్లు చూచిఁ గగనంబు
కాకులొదిగి యుండె వీఁక దఱిగి.

ఇట్లు పెద్దయుం బ్రొద్దు సంగరంబున నాగరిక పక్షి బలంబు తద్దయు నష్టము నొందికుందె. వేటరులు లోన మాటుకొని యుండిరి.

లోని పులుఁగు లెల్ల లోపల నొదుగుటఁ
జూచి చీమలెల్ల జూలుకు బాఱి
భూ బిలాంతరమునఁ బోయి పుట్టలు వెట్టి
వారిఁ జుట్టుముట్టి మారి మసఁగె,

వ్యూహం బంతటఁ జెదరెను
ఆహవరంగమున ఖచదు లాగమి చీమల్
సాహసమున వెనుకొన, "దా
సోహ" మ్మని మ్రొక్కఁ దొడఁగి రతిదైన్యమునన్.

చిక్కిన, స్రుక్కిన, కాలికి
మ్రొక్కిన, దయ మాలి గండ్లమునుకొని తొలువన్
ఱెక్కల సంధులు సడలుచు
నొక్కుమ్మడి నేలఁ బడిరి ద్యుచరగణమ్ముల్

ఱెక్కలాడఁ బోక ప్రక్క మారఁగ లేక
చిక్కువడిన పెక్కు పక్షిగములు
నుక్కడంగు చుండె నెక్కడి వక్కడే
కుప్పగూలి గొప్ప తిప్పలొంది

వీరు కొద్దివారు వారు గొప్పవనకను
గండు లెదిరినంత గుండె బెదరి
మ్రోడువారి ఖచరు లూడని జాడిరి
చెట్ల గట్లఁ బట్టి చెదరి బెదరి

కాకి బలఁగ మెల్లఁ గడు సన్నగిల్లెను
గ్రద్దల మూఁకలు రద్దువడియె
కొంచల గుంపులు కొంచమై గనుపించె
అంచల పిండు గన్పించదయ్యె
డేగల పెనుసంఖ్య లోఁగి లెక్కకు వచ్చె
రామబంధులు లెక్క రాకపోయె
గూబల తండముల్ లోబడఁ జొచ్చెను
గోరువంక తుటుములు కొఱఁత వడియె

గండభేరుండ మండలి నిండుకొనియె
దిక్కు దెలియక పక్షులై ద్విజబలములు
కలఁగి చెట్టున కొక్కఁడు గట్టున కొకఁ
డై తొలంగిరి యసువుల యాసఁ జేసి.

లోక సంక్షయకర రణాలోకనమున
లోకబంధుఁడు దు:ఖాబ్ధిలోన గ్రుంకె
ననఁగనపరాబ్ధి ఖద్యోతుఁడస్తమించె
సహజమే గ్గాయిది యెందు సత్ప్రభులకు.

మ హా కౌ లీ న ము

రక్తసిక్తమునౌ సమిత్ప్రాంగణంబు
ప్రతిఫలించెడు గగనదర్పణమునందు
ననఁగ సంజకెంజాయలు నలము కొనియె
పక్షిజాలంబునకు నడ్డు పడె ననంగ
చిమ్మ చీఁకట్లు దిక్కులఁ గ్రమ్ము కొనియె.

ద్విజులఁ బఱచిన పాట్లను తెలిసి యేమొ
మొగము కెంపుగ ద్విజరాజు పొడిచెఁగాని
సత్త్వజాలము ఘనతరసత్త్వ మెఱుఁగఁ
దెల్లవడె మోము, చేతులు చల్లవడియె

అంత నిరుపక్షములవారు సంగరము సాలించిరి.

గండ్ల విజయంబు గనుగొని గబ్బిలంబు
ప్రబల సత్త్వసమేత సత్త్వముల పేడః
కాలు నిలుకడ కుదురని ఖగము లేదః
నిలిచి గెలుచుట లేదని నిస్పృహ గని.

సత్త్వజాలము లానంద సాగరమున
మునుగుచుం దేలుచుండఁగ మోసలికను
వచ్చి పలికెను ఋషిపక్షి పర్యాఁడల్ల
రాజసింహాన కెఱగి, కరంబు మొఱఁగి

శరణార్తిం గరుణార్ద్రదృష్టి గను నాచారంబు మీవంశకే
నపులం దుత్తమ ధర్మమౌ కతన, యుష్మద్దాస వర్గంబునన్
నరగన్ నన్నొక వానిగన్ నలుపు టాశ్చర్యంబుగాఁ బోదుసూ!
అరయన్ నీకిది చెల్లు రాజగురుసింహా రక్షమామ్! రక్షమామ్!

పన్నాలు గలవు గనుంగొన
వెన్నం జామును గనంగ విశదము గాదే!
చన్నం గుడువమె బిడ్డల
కన్నన్నా! మమ్ము జంతు లన కుందురొకో!

ఉన్నవి ఱెక్కలు గానీ
మిన్నంది చరింపఁ బోము మీ రెఱుఁగరొకో!
వన్నం గరుణింపఁ గదే
సన్నుతమతి రాజసింహ! శరణంబంటిన్.

ఇంత సెప్ప నేల? నిమ్మహా శాస్త్రజ్ఞు
లెఱుఁగ నైరి జంతువే యటంచు;
నందు సాత్వికుఁడను; నైహికం బొల్లను,
ఋషికులంబు వాఁడ నే మృగేంద్ర!

తల క్రిందుగఁ దపియించుచు
విల దినములు గడపుచుందు మిది మా చరితం,
బల వాలఖిల్యు లాదిగ
గల మౌనులు తపము సెడఁగఁ గలిగిరి వీరల్

దూర శ్రవణుండను నే
సారఫలాహారమునను జరుపుదు దినముల్,
ధారుణి జనసముదాయము
లారసి "మమ్మేగురునక్క" లనుటలు వినరే!

అనిన విని నక్క యచ్చెరువంది సింగంబు విన నిట్లు వితర్కింపం దొడంగె—

కాళులు నాలుగుం గలవు గాని, పులుంగుల చందమందె నా
వ్రేళులు గాళులుం గనఁగ; రెండవ దేమన కాళులుండినన్
వ్రేలెడుఁ గాదె క్రిందికి భువిన్ మృగజాలము నట్లుగాక యే
పోలిక జూచినన్ మనసు పోవక యున్నది జంతువౌ ననన్.

ఇట్లు వితర్కించు జంబుకంబు వాక్యంబులు విని గబ్బిలంబు నక్కపై నాగ్రహమూని—

పీనుగులఁ బీకితిను చచ్చు పీన్గ వీవు
పీన్గకై గ్రద్ద తోడుతఁ బీకులాడి
ఘోర "కౌలీన" మే యొడగూర్చినావు
'ముసల' మా యదుకులంబునం బొడమినట్లు
పుట్టితివి జంతు సంతానమునను నీవు,
తగుదు నని మాటలాడుదే తల నిగిడ్చి?

అనుటయు సింహము దాని కడ్డు వచ్చి—

తెక్కలు గల మృగమవె పో
యెక్కడి కేగితివి, యుద్ధ మింతకు వినవే?
"ఇక్కట్ల లేని బంధువు
చక్కట్లవి యేల మాకుఁ జాల్ పో బొమ్మా!"

అని రాజసింహుఁ డాడిన
వినియును విననట్లు లేచి విప్పుగఱులతోఁ
జనెఁ దైలపాయి యెందే
మనమున నవమాన భరము మల్లడి గొనగన్.

అంత నచట రామబంధువు తన బంధు మిత్రులతో నేకాంతమ్మున నిట్లనియె —

కుడిచి కూర్చుండలేక యీ గొడవలెల్లఁ
దెచ్చుకొంటిని నేను మంత్రి వరులార!
యెటులఁ దప్పింతురో గద! యిట్టి బెడద
నీటముంచినఁ బాలముంచినను మీరె!

చండకరు తీక్ష్ణకరముల సరకు గొనని
చుఱుకుఁ జూపులఁ జూచెడి శూరవరుల,
సత్త్వజాలము సంధించు చతురుఁ డెవ్వఁ
డరయఁగా వలె ఖచరసైన్యముల లోన.

అనుటయు గోరువంక యందుకొని "రాజవర్యా! తియ్యఁబలుకుల చిలుక మన కార్యంబు తీర్చలేదే?" అనిన రామబంధువు సమ్మతింపక యిట్లనియె—

పండ్లు కొఱుకుకొనుచుఁ, బైవచ్చి యన్న మా
టాడుచుండుఁ, జిలుక యైన నేమి?
మొగము నెఱ్ఱ చేసి జగడమునకుఁ గాలు
ద్రవ్వు రామచిలుక తగునె పలుక?

అనంతరము నెమ్మి "ఘనగాయకుఁడు కోయిల మన కార్యంబు నేర్పుమై తీర్పఁగలఁడు గాదే!" యనుటయు రామబంధు వంగీకరింపక —

నేనెఁగా పాటకుఁడ నని విక్కివీల్గి
కాకి గూటఁ బెరిగిన సంగతిని మఱచి
కాకిపలె నుంటకే యింత గర్వపడెడి
కోయిలం బంపినన్ సంధి గుదురఁ బోదు

అనుచుండ గ్రద్దన గ్రద్దలేచి కాకిం బేర్కొని —

కష్టసహనకు నలవడ్డ ఘనుఁడు వీఁడు
చేతులో పాని నొడిసి దాఁ జేకొనియెడి
నేర్పు గలవాఁడు; కాకియే నెఱపఁ గలఁడు
సంధి కార్యము శాత్రవసమితి తోడ.

అనిన వల్లెయని రామబంధువు వాయసంబును దాయల సన్నిధికి రాయబారిగాఁ బంపుటయు, కాకంబు సింహరాజు నా స్థానంబునకు వచ్చి, ముందుగా స్వస్తి వాచకంబుల నిట్లని యాశీర్వదించె —

జయము శ్రీ రాజసింహమా ! జయము జయము
సత్త్వలోక విద్రావణ ! జయము జయము
సమదవైరిభ కేసరీ ! జయము జయము
కరుణతో నను వాయసుఁ గావు కావు !

అట్టియెడ పులి రహస్యంబుగా సింహముతో నిట్లు పలికె.

"కావు కావను పలుగాకి గాని యితఁడు
చేకొనం దగు మృగరాజ సింహాసనకును"

అనుటయు నారాచసింగంబు కృపాంతరంగంబై

"అభయ మొసఁగితిఁ గాకమా ! యరపు లుడిగి
పలుకుమా నీదు సందేశ వాచకములు"

అని యనుజ్ఞనీయ, మిగుల భయభక్తులతో రాజుమొగంబుఁ జూచి వాయసం బిట్లు వచింపసాగె—

సత్త్వ జాలము, ద్విజబల సముదయములు
సవతితల్లి బిడ్డలును, కాశ్యపులు గారె !
వేఱుగాఁ జూచి, యొండొరుల్ బోరఁ జనదు,
సంధి గావింపు మృగరాజచంద్రః యింక.

అనినఁ జిఱుత యెక్కసక్కెముగాఁ గాకిం జూచి—

ఎత్తి వచ్చినార లేటికి సంధింపఁ
జూతురయ్య! యిపుడు చులుక నైతి
రోపి పోరి విజయమో, గాక స్వర్గమో
పొందఁ జూచుకొనుఁడు పొందు పొందు!

అనినం గాకి శాంతము వహించి కార్యకారియై చిఱుతపులిం గని—

చిఱుత దనపు బింకమ్ములు చెప్పకయ్య!
పనికిరానిది వైర మెవ్వరికి నెందు
సలుపు నయ్యది శూరవంశక్షయంబు
సంధి శుభదంబుగావింపఁ జనును మనకు.

అనుట సింహము పులితో "మృగాంతికము"గా నిట్లనియె

పైకి నెత్తి వచ్చి పగ మీఱువారలు
కాళ్ళ బేరమునకుఁ గడగి నార
లైనదేమొ మైన వాపలఁ బెగువాఁక
బిగియు దావ చెంత చేరమున్న

అని కాకి దిక్కై యిట్లు వాక్రుచ్చె—

సైకమా! శరణార్థియౌ శత్రునకును
నభయ మొసఁగుట వంశ మర్యాద మాకు
సమర భీరుతఁ గాదుపో! శాంతికొఱకు
సంధి గావింతు చేపట సముచితముగ.

అనిన విని, మహాప్రసాదంబని కాకి యాకసంబున కెగిరి, తమ వారిం జేర నరిగి, సంఘవృత్తాంతము నివేదించి, ఖచర బృందముల కుందువాపె.

## సంఘవార్త విని గబ్బిలంబు పశ్చాత్తాపము

గబ్బిలంబు మోసము నెఱింగి దానిని ఖగములును, మృగములును గూడ బహిష్కరించుటయు నయ్యె. అదిమెఱింగి గబ్బిలంబు తబ్బిబ్బు పడి,

ఇటు ఖగంబులఁ జేరక, నటు మృగంబు
లందు నొక్కఁడఁ గాక నే నక్కటకట!
యుభయతా భ్రష్టతను గాంచి యుడుక వలసె
మహితమౌ నా ప్రయత్నము మంట గలిసె.

మంచియో, చెడ్డయో పదిమంది తోడఁ
గలసి మనుటయె స్వర్గసౌఖ్యమునకుద్ది
సాటివారికి వెలియగు స్వర్గసుఖము
దుర్గతియె గాని వేఱుగాదుగ నిజంబు

స్వార్థ పరతంత్ర మతి కష్టసమయము నను
సాంఘికుల వీడి వేరైన జాల్ముఁడైన
నాకు సంఘ బహిష్కరణంబు కంటె
నుపతరంబగు శిక్ష వేఱొండు లేదు

రెంటికిని జెడ్డ రేవఁడ వంట కింక
గబ్బిలాయి యవస్థను గంటివనుచుఁ
బలుకుదురుగాదె? బుడమి నెప్పటికి మనుజు
లిట్టి దుష్కీర్తి నెడలించు టెట్టు లింక?

కష్టముల వీడి సంఘము, కాలమందు
ననుభవింతును సౌభాగ్యమని తలంచి,
పనికి మాలిన తెలివి కన్పఱచి కడకు
బొందితిని "త్రిశంకు స్వర్గభోగ" మేను.

దిక్కుమాలిన కవులిక దీనిఁ గూర్చి
గ్రంథములు గూడ వ్రాయఁగాఁ గడఁగుదురుగ,
నేమి సేయుదు? బయటికి నెట్లు పోయి
తిరుగుదును సాటివారలఁ దేఱి చూచి?

పవలు నేనిక బయటికి వచ్చి యెవరిఁ
జూడ నొల్లను; చీఁకటిం జూచి గాని
తిరుగఁ బోవను; దాఁగుడు మూఁత బ్రతుకు
నిదియె దీక్షగఁ బూనితి నిప్పుడేను.

# పంచమాశ్వాసము

వసతి పొదరిండ్లలోన నేర్పఱచుకొనిరి
నైజమగు తీవపందిట నాఁటి సర్వ
జంతు పక్షి సాంఘిక మహాసభనుసలుప
తీరుమానించుకొనిరి మంత్రివరు లెల్ల.

చివురుటాకుల తోరణాల్ చెలువమీఱె
నేలపైని పచ్చిక తివాసీలు దనరె
ఱాల గద్దెలు నందందఁ గ్రాలుచుండె
వెలయ సింగపుఁ బీట గన్పించె నడుమ.

ఒక్కప్రక్కను ప్రబల సత్వోర్జితులగు
సత్వపాళి, సరీసృప సముదయములు,
సర్వపక్షి కీటాదిక సమితి వేఱు
ప్రక్క నుచితాసనంబుల వరలుచుండ
నడుమ కేసరి సింహాసనంబు నందు
నిండు పేరోలగమునఁ గొల్వుండె నంత,

ఎల్లర యామోదమ్ముం బడసి శుభముహూర్తమున రాజసింహుఁడు సార్వభౌముఁడుగాఁ బట్టభద్రుఁడయ్యె—

మ హా కౌ లీ న ము

గంధగజ మభిషేకంబు గావించెను
సాలీఁడు మేలి వస్త్రము లొసంగెఁ
జిత్ర చిత్రాసనాల్ జివ్వంగి పెట్టెను
పునుగు కానుక పెట్టెఁ బునుఁగు పిల్లి
ఫణిరాజు భక్తిమై మణిభూషణము లిచ్చెఁ
జుక్క బొట్టిడెను గస్తూరిమృగము
చామరములు వేసెఁ జమరీమృగశ్రేణి
తవర జిరాఫి ఛత్రంబు పట్టె

చదివె మంత్రముల్ జంబుకశాస్త్రి కడిమి
సంకుమూతిగుజ్జము బిట్టు సంకు వొత్తె
బలసి మెఱుగుడు బసగుల్ పివాళు లిచ్చె
వైభవంబున నా యుత్సవంబు వేళ.

ఇంబగు సామగ్రుల పా
రంబగ వర్తకులు గొంచు రా నొక్క మొగిన్
డంబలరఁగ మధురాహా
రంబులు మధుజీవనములు త్రాతిఁగఁ బెట్టెన్.

వడ్లవారలు భవనముల్ వడసఁ గిర్చ
గిజ్జిగాఁడులు దివ్వెలు కీలు గొలిపె;
గొల్లభామలు పాల్పెరుగులను దెచ్చె
చాఁకలీఁడులు మేలిమి చలువ లిచ్చె.

కీరకీరవాణులు చవులూరఁ బలుక
పేర్మిఁ బికపికవాణు లోపికను బాడ
నీలకంఠసుకంఠులు నృత్య మాడ
పల్లవీపల్లవాధర లుల్లసమున
గ్రిందు మీఁదుగ సభ మహానంద మయ్యె.

భోగినుల వికృతపు నృత్యరాగములను
గాయకుల మోటుపాటలఁ గడుపు లుబ్బఁ
బ్రహసన మొనర్చి సువినోదపరతఁ గూర్చె
నచట పరిహాసపుం బిట్ట యద్భుతముగ.

బిచ్చగాండ్ర పాటలు కొన్ని యుచ్చరించి
పెడచెవిం బెట్టి వడివడి పెడ మొగంబు
తోడనడచెడి ధనికుని దుండగంపు
నడకసొంపును జూపించి నవ్వుగొలిపె.

సేవకాళి విధేయతా చిహ్నములను
ప్రభుల కీవియు నచ్చంపుఁ బ్రకృతిఁ దోపఁ
గనియు గ్రుడ్డిగ, విని చౌడుగ మెలంగు
విధము నెంతయుఁ జూపి నవ్వించె మివుల.

అట్టి యెడ భేరవంబు రాజసింహాసనకు ఖగసత్త్వంబులనెల్ల వేఱువేఱ నిరూపించి చూపింపం దొడంగె.—

వీరు నాగరికులు, స్వార్థ విరహితులును
ధరణి మనుజసేవాధురంధరులు; వీరు
సర్వతంత్ర స్వతంత్రులు. సత్త్వ సంయు
తాకలుషవన్యతోద్ధరణా సహాయ
శూరవరులు, వనేచరుల్, సూ! మృగేంద్ర!

భారతులు వీరు, గాంధర్వ వరులు వీరు
కవులు వీరలు, ద్విజవరుల్ ఘనులు వీరు
పత్పథవిహార చతుర దోస్సారయుతులు
దూరదృక్ప్రసారణ మహోద్ధుర గరిష్ఠ
వీర విహారణచణులగు వారు వీరు.

అని గోమహిషాది పశుసంతతిని, ఖడ్గశార్దూలాది వన్యమృగ సమూహమును, శుకపికమయూరాది పక్షిసముదయమును, హంస సారస కారండవ ప్రముఖ జలపక్షి బృందమును, వేటరులైన గరుడసాల్వాదులను క్రమముగ జూపి, "పక్షిజాలమెల్ల మీకు విదితమే గదా! ఇంక ఖగేశ్వరుల వేరువేఱ నిరూపింతు"నని యుక్తిని —

విను కశ్యపప్రజాపతి
తన పెక్కురు వనితలందుఁ దనమానినిమహో
వినయాన్విత వినత పలన,
ననూరు తార్క్ష్యులను సుతుల నవనిం బడసెన్.

మాతృదోషమున వనూరుఁ డాతఁడగుటఁ
దల్లిపై నల్గి శపియించి దాసి గాఁగ
నల త్రిమూర్తిస్వరూపుఁడై యలరు భాను
రథముఁ దోలుచుఁ గొలుచు సారథిగ సతము.

ఇంద్రు రణమందు గెల్చి ఖగేంద్రుఁ డయ్యె
నమృతమును దెచ్చి మాతృదాస్యంబు వాపె
వాహనంబుగఁ బడగగాఁ బరగి విష్ణు
సేవ గావించు గరుడుండు చేవ మిగిలి.

అందు ననూరునకు సంపాతి జటాయువు లను నిరువురు పుత్రులు గలిగిరి. వార లిరువురు మహాజవసత్వ సమన్వితులై, ప్రడీనోడ్డీన సండీనాది గతివిధానంబులఁ బ్రావీణ్యము జూపుచు నొండొరుల మిగుల వలయునను తలంపున రెట్టించిన బింకం బున సత్పథంబున మహోన్నతులుగా నెగసి, యెగసి, సూర్యమండలముఁ జేరఁ బోయిరి. అట్టియెడ సంపాతి పక్షద్వయంబు సహస్రకిరణసంతప్తంబై, ధ్వస్తం బగుడు, నతండు నింగిని నిలువలేక నేలం బడియె. జటాయు వది గని క్రమంబున దిగి వచ్చి, అన్న దురవస్థకు మిగులం గొగిలి, చేయునది లేక సమాదరంబున నాతని నరసి పోషించుకొనుచుండె.

రాజసింహుఁడు దశరథరామచంద్ర
మూర్తి యర్ధాంగి, మైథిలి, పుణ్యసాధ్వి
రక్షకై పక్షయుగ్మము, రావణోగ్ర
ఖడ్గధారకు బలి పెట్టు ఘన యశస్వి.

ఆ జటాయువు మృతజీవియై చెలంగు
సార్థకంబుగ రామబంధ్వాఖ్యఁ గాంచి;

నాఁటగోలెఁ బిల్తురు, తదన్వయము నట్టి
యట్టి సద్వంశవారాశి యమృతకరుఁడు,
రామబంధుఁడు, పులుఁగుల రాజరాజు,
ఆర్తబాంధవుఁ, డక్షయ కీర్తిశాలి,
దక్షుఁడై యేలు శ్రీరామరక్ష గాఁగఁ,
బక్షి సముదయంబులఁ గటాక్షేక్షణముల.

అని యెఱింగించిన మృగేంద్రుఁడు, ఖగేంద్రుఁడు నుభయులు నొండొరులచే నుచిత సత్కారంబుల నంది, సరస సంభాషణంబులఁ గొంత ప్రొద్దు గడపిరి. అంత జంబుకేశ్వరుఁడు నొక్కొక్క ఖగేంద్రుం జూపుచు మృగరాజుతో నిట్లనియె —

అమృతాంశు కిరణంబు లనువుగా భుజియించి
    బ్రదుకు జీవంజీవ పక్షివీరు
అగదంక రాంశువు లాహారముగఁ జేసి
    వర్థిల్లునౌ చక్రవాకు లీరు
ఘనుల జీవనమును గాని గైకొనఁ బోవి
    కట్టిడిగల చాతకములు వీరు
పాలు నీరును నేర్చు ప్రజ్ఞా విశారదుల్
    పరమహంస శ్రేణి వారు వీరు

పంచమమునఁ బాడు పరభృతంబులు వీరు
షడ్జమునను బాడి చతుర మతిని
నిత్యకృత్యము గను నృత్య మాడెడి వారు
నీలకంఠనములు నెమ్మి వీరు.

గండ భేరుండుఁ డుద్దండ ఖండనుండు
మెండుకొనియుండు వైష్ణవా ఖండమండ
నముగఁ జేలాంచలంబుల సముచితముగ
వైష్ణవాగ్రేసరుం డెంతవాఁడొ వీఁడు!

వక్రగాముల గ్రుడ్లను పైకిఁ దోఁడు
జెట్టి గొరువంక నాఁ బడు పిట్ట యితఁడు;
తాలు దిని హరించెడి పావురా యితండు,
పల్లటీలను మొనగాఁడు మల్లుఁడితఁడు.

ఇతఁడు బంగారు పిచ్చుక, యితఁడు పాల
పిట్ట, యితఁడు కౌశికుఁ డిదె వీడు సాల్వుఁ
డితఁడు వ్యాఘ్రాటుఁడగు ఖంజరీటుఁ డితఁడు
మరియితఁడు దార్వా ఘాటుఁడరయరోటు!

కత్తి గట్టి విజృంభించి కలన దుమికి
కంఠమందున నూపిరి గలుగు వఱకు
నాలుగెనిమిది గాక పెనంగు వీర
వరుఁడు, ధీరుఁడు, కుక్కుటేశ్వరుఁడు వీఁడు.

అని యెఱింగించి, యొక్కొక్కరిం బ్రత్యేకముగా ముందునకుంగొని వచ్చి రాజునకు మ్రొక్కించె. అనంతరంబు జంబుకంబు "ఇరుగో! వీరిం జూడుము! అల్పవ్యక్తులయ్యును ననల్పగుణ సమన్వితులు. రసజ్ఞ శిఖామణులు" అని భృంగ రాజుం జూపి యిట్లనియె——

కాంచనాశావిరహితుఁడుగాఁ జెలంగి
సర్వసుమనోనురంజన సరణి మిగిలి
శ్రీసదాలయమైన కుశేశయమున
పటుమధువ్రతోన్నతి నుండు భవ్యుఁ డితఁడు.

తరువాత మెఱుఁగుడు పురుగులం జూపించి యిట్లనె—

బ్రతికి యున్నంతకాలము పరహితంబు
విడువ కొనరింత్రు సుజనులు పృథివిలోనఁ;
ద్రుంగి పోయియు నీ జ్యోతిరింగణములు
పక్షికులముల యిండ్ల దీపములు నిలుపు.

ఇట్లు పలికి యనంతరము—

వలలం బన్నియు బోనులఁ
బొలుపుగ నిడి శాత్రవులను బొలియించు విధమ్
వెలయం బ్రకటించెను, నీ
యిల వైరుల పాలిటి పులి యీఁగల పులియౌ.

అని యీఁగల పులిని చూపించి తర్వాత—

రాజసింహుఁడు శ్రీ రఘురామ చంద్ర
మూర్తి హస్తాంగుళీత్రయ ముద్రితంబు
నైన చరమాంగ సౌభాగ్య మమరు వాఁడు,
బుడుత నడకల గడుసరి యుడుత వీఁడు

అని యుడుతం జూపుటయు రాజసింహుడు ముచ్చటపడి వీక్షించుచుండ, నుడుత పొగడిక విని సహించలేక—

సుమనముల సఫలత నొందఁ జూడలేక
కొనలు సాగనీయక, మఱి ననలు దొడగ
నీక, నల లతాతన్వుల నేపడంచు
కుమతి, పిసినారి కుత్తుకఁ గొఱికి రేని
పాప మనరాదు పుడమి నెవ్వరికి నెపుడు.

అని మార్జాలము లోలోపల నుడుకు కొనియె, నంత ఫేరవంబు మఱియొక్క పరమ రహస్యంబు విను మని సింహంబు చెవిం దన ముఖంబు జేరిచి యిట్లను, ఇదిగో! మమ్ముం జూడుము. ఈతడు కృష్ణుడు, నేను అర్జునుడను వాడను. అన్వర్థ సంజ్ఞలము.

మును ద్వాపరమున వీరలు
జనియించిరి కృష్ణ సవ్యసాచులు నాగన్
విను యదు కౌరవ వంశము
లను గ్రమమున భూ భరము తొలగింపఁ దగన్

వారే యిప్పుడు తిరుగం
గూరిమి నీ పక్షిజంతు కులములలోనన్
వారక గాక సృగాలము
లై రేమన నేర్తు వారి యద్భుత లీలల్?

అనిన విని సింహం బచ్చెరు వంది నా యిరువుర శిరంబుల మూర్కొని సమాదర బుద్ధిం జూచె. వారును నాతని యాదరణకు మిగుల నుబ్బొంగిరి. ఆ మహా సభ యందలి సభ్యులు తమ తమ యభిప్రాయంబులఁ బ్రకటించు సందర్భమున గోవు ముందునకు వచ్చి యెల్లరు విన నిట్లనియె—

జడభరతుని సాధుత్వము రహూగణుని యందలమును మోయించినది. అట్లే జంతువుల సాధుత్వము మనుష్యునకు బానిసం జేసినది. వన్యమృగముల శౌర్యముం జూచి సహింపలేక మానవులు వేటాడి వధింపం దొడంగిరి. ఆవధ్యత్వముంజూచి వన్యమృగము లందుం గ్రూరత్వమునా పాదించిరి. అక్కతన సాధుమృగము లనియు, ఘాతుక మృగములనియు భేదభావము పొడమినది. ఇదియంతయు మానవుని స్వార్థపరతయే. ఇట్టిమానవుని దుర్బుద్ధిగ్రహింపలేకమన మన్యోన్య కలహములం బెట్టుకొంటిమి.

స్వార్థపరుండగు నరుండు మనలనెట్లు వంచించెనో చూడుండు—

కామధేను వటంచు ఘనకీర్తిం గప్పి
గోమాత యనినన్ను గొప్పగాంజెప్పి
ఆకసంబునకెత్తి యత్యాదరించి
లోకాలలోన గోలోకంబునుంచి
బసవ పురాణంబుం బ్రౌఢిమం దీర్చి
అసమ వృషాధారమవనికిం గూర్చి
పంచగవ్య ప్రభావంబు యోజించి
అంచి తంబుగంద్రావి మించియున్నాండు.
దాయ గట్టియు పాలు ద్రావుచున్నాండు
మానవత్వంబును మఱచియున్నాండు.
దానవత్వంబును దవిలియున్నాండు.
మాననీయుండుగాండు మహిలోనవీండు
వానర వారసత్వముం గన్నవాండు
నిలువెల్లమాయతో నిండియున్నాండు
బలమైన కోర్కులుపండియున్నాండు.

ఐనను నెన్నివిధాలనూహించినగాని మృగములకంటె నరుండు మిన్నగాం బోండు.

ధర్మమూర్తులై నాల్గుపాదముల నడచి
మట్టియును బైడి సమత వేమరక చూచి
కొమ్ము గొరిజలు మొలుచు యోగమ్ము గనిన
మనుజవర్తన మాకు సమానమగును.

తాను తినునది గడ్డిగఁ, దా నొరులకు
నిచ్చునది భాగ్యముగ మది నెఱింగి, పాలు
వదలు బిడ్డను, పరు నొక్క పగిదిఁ గనిన
మనుజవర్తన మాకు సమానమగును.

ఏ గడ్డి యేని పట్టెఁడు వేసిన న్మెసి
ప్రీతిఁ దియ్యనిపాలు పితుకునట్టి
పట్టెఁడు కూటికి జానిసయై రేలు
బవళులునుం గస్తి పడెడునట్టి
ఏమేని గమగొన్న నెల్ల పుట్టలు వ్రీల్చి
సంభ్రమంబున భుక్తి సలుపు నట్టి
విషయసుఖంబునువీడి పరార్థమై
కృషి చేసి ఫలితంబు నిచ్చునట్టి

పశు కృతజ్ఞత, కుక్కవిశ్వాసము, నల
కొఱవి చీమల దగు కల్పుగోలు తనము,
వృషభము పరోపకార పారీణతయును
నేరఁగాఁగల్గు నరునకుఁ బేరు పెంపు.

ధనమని, సంతతి యని, కా
మినులని మృతిదనుకఁ గూరిమిన్ విడువఁగ లే
కను, నీషణత్రయంబున
మనుజుల గతిఁ జిక్కు వడుట మానుఁడు మృగముల్.

జ్ఞానవంతుఁ డనని నిక్కు మానవు బలె
తుచ్ఛమగు విషయాసక్తితోడఁ గాక
వంశ వర్ధనమునకుఁ జెప్పఁ బడు సర్వ
జంతు సామాన్య ధర్మము సలుప వలయు.
చెప్పు గొఱికెడి కుక్కకే చెప్పఁ బడియె
నొక్క ఋతువది యాపాటి యోగ్యతయును
లేకపోయెను మానవలీల లందు
వారి కైనైన, నిఁక మన వారిలోన
వచ్చి శృంగార మీవనిం బనికిరాదు.

స్వార్థము వీడి యిమ్మహిఁ బరార్థముగాఁ బసరంబులుం దగన్
సార్థకతం గనంగఁ దమ జన్మము కానక మానవుండు, దా
స్వార్థ పరాయణత్వమునఁ జచ్చెడు నేమన నౌ "పరోపకా
రార్థ మిదం శరీర" మను నాగమ శాసనముల్ దలంపకే!

వాన రాకడ ప్రాణము వాయుటయును
నెఱుఁగఁజాలని మనుజులు పుడమె మాకు?
నుడుగక పిపీలికా యత్న మొనరుచునెడ
సాటి రాగలరేమొ యేనాఁటి కేని!

హరి హరి! యేమన బుణ్యము
పురుషార్థము నాక స్వార్థమునె గోరి నరుల్
నరకమునఁ బడు తెఱంగునఁ
జరియింపం జనదు మనకు జంతువు లారా!

జ్ఞానము కలవాఁడై భువి
నానా మృగ పక్షి వృక్ష నగ చయములచేఁ
గానగు నుపకృతులందుచు
దేనికిఁ గొఱగాక నరుఁడు తిరుగు వృథగన్.

అంత నొక్క శకుంతంబు సంతసంబున ముందున కరుదెంచి యిట్లని ప్రకటించె—

ఱెక్కలుగని సత్పథమునఁ
మిక్కిలి యుచ్చతఁ జరింప మేకొనినన్ మా
కొక్కెడ సము లనవచ్చును
తక్కిన మానవులు మమ్ము దరియంగలరే?

పక్షి యయ్యును జత వాయుపట్ల, నొండు
పక్షిఁ గూడదు గద గువ్వ, పడతులుండి
మానవులు పరస్త్రీల నెమ్మదిని నిలిపి
పరమ బాలిశులగు టెట్లు పలుక నేర్తు?

కాలజ్ఞానంబునకు, న
కాలమరణము నిలఁ దఱచు గలుగుటగని, యే
లీలం దైవిక మనకను
చాలఁగ బెనగుదురు పౌరుషమునకు జనముల్.

భ్రమరంబు వోలి యెల్లరు
సుమనోవ ర్తనము నలుపఁ జూడఁగడఁ గుఁడీ!
కమనీయమైన కాంచన
మమహిత మతి నపహరింప నాసపడకుఁడీ!

ఇట్లు ప్రకటించుటయు, జంతుశకుంతమ్ముల యభిప్రాయ ప్రకటనమ్మునకు ప్రహర్షంబు నంది హర్యక్షంబు సభ్యుల నీక్షించి, యిట్లని హితంబు బోధించె—

వాయసారాతియన్ వాదేల కౌశికా!
కాకులదెసఁ బోక గడపు దివము
లహితుం డవని భూమి నాడి కేల ఫణీంద్ర!
కన విననట్లుగా మనగదయ్య!
ప్రేమ లేదని నీకు పేరెన్నిక యదేల
రాగయు క్తుఁడవు గారా శుకుండ!
ఘాతుకుం డని యపఖ్యాతి యేటికి పులీ!
పెద్దతనము బూనవే యిఁక వయి.
చిఱుత తనమును వీడు మీ చిఱుత మెకమ!
పరభృతంబ కృతఘ్నత పాడిగాదు.
భ్రమణమును మాని మెలఁగుమా భ్రమరకుండ!
ఘనులపైని విర క్తిని నీవు గనకు హంస!

తల్లిచాటు బిడ్డలఁ బట్టి తలలు గొఱుక
తగనిపని సుమి! మార్జాల తండమునకు
తలలు బొఱియలఁ దాచుపాముల వధింప
గృధ్రములకుఁ జెల్లదిక మహీతలమున.

మృగవల్లభుని హిత మాకర్ణించి, యెల్లరు మహా ప్రసాదమని యామోదించిరి. ఆటుపైని వా వన్య మహాసభ, దీర్ఘచర్చా విమర్శనములతో నిర్విఘ్నముగా మూడు దినంబులు జరిగె. ఆట్టి చర్చాఫలితములుగాఁ బెక్కు తీర్మానములు నెల్లరచే నామో దింపఁబడి ప్రకటింపఁ బడియె. అవియెవ్వి యనిన—

విసువక బిడ్డల వీఁపున మూఁపున
ధరియించు చిరుకప్ప తల్లిప్రేమ.

కడుపు తీపిని బిడ్డఁ గడుపున హత్తించి
తగఁ జరించెడి కోఁతి తల్లిప్రేమ

కన్న సంతానంబుఁ గడుపులో నిడుకొన
దయ సాకు కంగారు తల్లిప్రేమ.

తన యాయువును గూడ ధార వోసి మహి వ
ర్థిల్లమనెడి యెంద్రి తల్లి ప్రేమ

కడుపు చించిన ప్రజ దీర్ఘకాలము మన
దీవన లొసంగి దివికేగు తేలు తల్లి

ప్రేమ సౌభాగ్య మేరికి వినుతి సేయ
సాధ్యపడదని గర్వింప జాలు మనకు.

గరుడు నేనియు సాళ్వని గాని యెదిరి

కుత్తుకను పందెమిడి వైరి గ్రుడ్లు దోడి

పడఁతిఁ బిల్లల కోడిఁ గాపాడు కానెడి

పుంజుగా దెల్పును కుటుంబ మోహ మెదియొ.

ఇంతకంటె మానవుల వాత్సల్యము లొచ్చుగాని హెచ్చు గాదనునది యథార్థము.

నేర్పుమై వరియించు నెరజాణ పిచ్చుక
పోరిలో గెలిచిన వీరవరుని

ఘనతరనటకుని కాంక్షించి కవగూడు
నిండు నెమ్మనమున నెమలి పెంటి

చక్కని నడవడి సరసుల మెలఁగెడి
వాని నరసి కొనున్ వలచి హంసి

వలచి గుబాళించి వలపింపఁ జాలిన
వాని సంగతి గోరు పావురంబు

హెచ్చు గాయకుఁ గూర్చు కోయిల వెలంది
మించు సుందరు నేర్చు నర్మిలిని పెట్ట
రహి స్వయంవర సూత్ర నిర్ణయము మొదల
సల్పినది పక్షులనుటకు సాక్ష్య మింత

గ్రుడ్డివారికిఁ జేయూత కొదుక కిచ్చి
బహుళ ధన సంచయంబులఁ బాలొసంగుఁ
జోరవృత్తియె జీవనాధారమైన
యెలుక దీన రక్షణ ప్రబోధించుఁ బ్రజకు.

మహిని యోగాభ్యాసమహిమంబు కప్పచే
నెఱిగింపఁ బడె నన్నగుఱుతు మాట
వాయు భక్షణమున వరలు సామర్థ్యంబు
పాము స్వత్వంబనఁ బరగుమాట
నిరశనవ్రతదీక్ష నెఱపుట లీనాఁడె
గ్రద్ద నక్కలయందుఁ గలుగు మాట
ఏకపత్నీవ్రత హిత చర్యమునకుఁ దా
నాదర్శకము గువ్వ యన్నమాట

మఱవఁ బోకుఁడు నెమ్మది, మానవులకు
మనము వెనుకాడు మాటలు కనము వినము.
సర్వమును వారు మనవల్ల సంగ్రహించి
గర్వపడు చంద్రు కనుమిన్నుగానఁ బడక.

మండు కోపనిషత్తు మఱి తైత్తిరీయంబు
ప్రకటించినది మనవారు గాదె!

మును జలస్తంభమున కుపాధ్యాయుఁడు
చేఁప గాదని నరుల్ చెప్పఁగలరె!

నేఁటి భిషక్కులె నీమాను కనుగొంట
కాఢార మొక గువ్వ యనుట వినమె!

యెండి కట్టె యయిన యే పదార్థము నేని
పక్వదశకుఁ దెచ్చు పరమ విద్య

కఱపు వారలు కొర్నాసి గాక యెవరు?
మానవుల కంటె ముందంజ మనది సుమ్మి
సర్వమును వారు మనవల్ల సంగ్రహింవి
గర్వపతు చంద్రు కను మిన్ను గానఁ బడక.

దూరదృష్టి సార్థకముగ బోరువయును
తెక్క లాదవిన బిడ్డల నాక్క యెడల
నిలువనీయనీక దవ్వు నావలకు దఱిమి
వలస పోవుటవలని లాభములు తెలుపు.

పేర్మి" కంఠీరవ" పదంబు, "వృషభ" పదము
"నాగ" "శార్దూల" ముఖ లసన్నామములను
బిరుదు నామంబులుగఁ గూర్చి పిలుచుకొంద్రు
మానవులు మేటి వీరుల మహిమఁ జాట;
అందు మనవారి యాధిక్య మచ్చు పడదె?
ఇంత కన్నను దార్ఢ్యమేమి వలయు?

ఎద్దు, గుఱ్ఱము. సింబోతు, నేనుఁగులును
నెమ్మి, కోయిల, నీర్కోడి నెఱపు నట్టి
ధ్వనులఁ బట్టియె గాదె సప్తస్వరములఁ
దగ నెఱిఁగిరి సంగీత శాస్త్రజ్ఞు లిలను?
గాన విద్యకు మనవారె గారె గురులు?
మానవాధిక్య మిందేమి గాన నయ్యె?

"కలకంఠ మధుర కంఠీ!
కలహంస నిభప్రశస్తగమన! మయూరీ
లలితశుభాంగీ" యని మను
జులు జాణలగు సతులఁ బిలుచుకొనెదరు గదా!

బళిర! యిది మన సహజప్రభావములను
వినుతిసేయుటగాక వేఱనుట యెట్లు?
కాన మనుజులకంటె నెద్దాననైన
మనది ముందంజ యను మాట మఱవ వలదు.

కాని మానవులయం దొక్క గొప్ప వశీకరణశక్తి వర్తిల్లుచుండు. అందు వల్లనే వారు ప్రాణికోటిలో నగ్రగణ్యు లగు చున్నారు.

సత్పథ విహరణ చతురులఁ ద్రుటిలోన
వలపైచు కొంద్రు నజ్ఞుల నొనర్చి
సరస సంవాసులఁ గొఱకు జూపి యొకింత
బొలియించు చుంద్రు నూఁతలను వేసి,
పులివంటి వారల బోనులో నెక్కించి
పిల్లులఁ గావించి విడుచు చుంద్రుం
వృషభంబు నేనియు విత్తులఁ బడఁ గొట్టి
చెప్పు సేతల మెల్గఁ జేయుచుంద్రు,

కంటఁ బడు పాము నేనియుఁ గడచి పుట్టఁ
బడఁగ నీయరు దుర్మార్గపరులు నరులు;
చాలు వీరల జ్ఞానమ్ము కాలి పోను !
పాప మే రీతిగ ఫలించి బ్రద్దలగునొ!

స్వేచ్ఛగాఁ దిరిగెడి చిలుక గోరంకుల
బంధింతురు వినోద పరత కొఱకు
బెదరు చూపుల జింక కదుపు వేఁటాడుదు
రుబుసు పోకకుఁ గూరుచుండ లేక
గాలిలో నెగిరెడి ఖగముల వ్రేతురు
కొదుకక లక్ష్యంబు కుదురు కొఱకు
కప్పగంతుల యాట గావింత్రు నీటిపై
నిచ్చ దీరగఁ బ్రొద్దు పుచ్చుకొనఁగఁ

"బల్లిచెలగాట మెలుకకుఁ బెద్దప్రాణ
సంకటంబ"ని తెలియఁగఁ జాలరొక్కొ!
చాలు వీరాలజ్ఞానమ్ము కాలి పోను
పాప మే రీతిగ ఫలించి బ్రద్దలగునొ!

బాబో! మానవుని దౌష్ట్య మేమన వచ్చును?

పొగరెక్కిన యా బోతుల
ముగుదాళ్ళను బొడిచి సాధ్యముం బొనరించున్
మిగులం బోయెడి పశువుల
నొగి గుదిబండలను గట్టి యుద్ధతి మాన్పున్

ఏడికల, సిడిపోతులఁ గూడగట్టి
చిక్కములు వెట్టి మూతులు నొక్కివట్టుఁ,
గఱవ నేర్చిన గుఱ్ఱాల గడుసు నోళ్ళ
కళ్ళెములు వెట్టి పగ్గాలఁ గట్టి వట్టు.

పుంగవంబుల ముగుదాడు బొడిచివట్టి
"డూడు బసవన్న" లను జేసినాఁడు నరుఁడు
కోరలను బీకి విషసర్పకోటి నట్టె
బుట్టలం బెట్టి యాడింపఁ బూనినాఁడు.

కొమ్ములను దఱిగి కఱకఱ,
కొమ్ముల పోతులను బట్టి, కొమ్ములు దొమ్మల్
వమ్ముగఁ దము సేవింపఁగ
సమ్మతి నిల్పుదురు నెంత సాహసులు నరుల్ ?

గార్దభముల గుఱ్ఱంబుల గలియఁ గలిపి
కంచరంబుల సృష్టింపఁ గలిగినారు
కులము గాని కులంబులఁ గూడఁ గట్టి
పశులను గూడ సంకర పఱచినారు.

సాళువంబుల వేఁపుల సరగఁ బెంచి
ఖగమృగంబుల వేఁటాడఁ గడగినారు
జాలి, పాపము వారి చిత్తాలయందుఁ
గలికమున కేని యావంత కానరాదు.

పుష్ప, పల్లవ, మధు, ఫలమ్ముల హరించి
పశులకు నిల్వ నీడైన వృక్షములను
విఱచి వైతురు కూఁకటి వ్రేళ్ళ తోడ
పాప మే రీతిగ ఫలించి బ్రద్ద లగునొ?

అరవఁగా గొంతు గోయుదు రయ్య కోళ్ల
గొఱ్ఱె పోతుల, మేకల ఘోరముగను
కట్టి నోళులః లేగల కడుపు గొట్టి,
కితవులై యాల, గేదెల బితుకు కొంద్రు.

ఘోరతరముగ ఘోషిల్లఁ గూల్చి వందిఁ
కట్టి మంటను బడవైచి కాల్చి తింద్రు
హృదయ మన్నది వారల కెందు గలదు?
మానవులు సేతు రెట్టి యమానుషములు.

ఎఱిఁగి పులిగోళ్ళ గైకొన నిచ్చగింతు
రడవి యేఁనుగు దంతము లపహరింత్రు
దిక్కులకు నేని యంతము దెలియ వచ్చు
వారి యాసకుఁ గడ లేదు వసుధ లోన.

ఎదుటఁ బడివారిఁ బొలియింప నేరుఁ గావు
కన్నముల చూర్ల మచ్చుల కదలఁ జేసి
కొక్కు లెలుకలు చుంచులు బొక్క పెట్టి
దోళ్ళ దోపుగఁ గొంపలు దోచవలయు.

కంటఁ బడక రహస్యంబుగాఁ జరించి
కూల్పు వలెఁ జెదపుర్వులే కొంప నెల్ల
ప్రక్కలను జేరి నిద్దురపా టెఱింగి
వెచ్చరక్తము నల్లులే పీల్చవలయు.

ఈగలే కశ్మలము దినిపించవలయు
మశకములు కుట్టి నిద్దుర మాపవలయు
పెక్కు వ్యాధులు గొని తెచ్చి పెట్టి పీచి
పీల్చి పిప్పిని గావించి వేయవలయు.

కొండిభట్టుగారు కోపించి వడి మీటి
లబలబ లౌదవించి ప్రబలవలయు
పుట్టనాగు సామి ముట్టి ప్రాణములను
కడను ముట్టఁ జేయ గడగఁవలయు.

పాప మంతయు వ్యాధి రూపంబు దాల్చి
అడుగడుగు నందు వారల నడఁచుఁ గాత!
ఇన్నిటికి సాక్షి యా పరమేశ్వరుండె
విహిత రీతిని శిక్ష గావించుఁ గాత!

మతభేదరజ్జువుల్ కుతుకలఁ బలిమిమై
నురి పెట్టి యుబ్బాత లూచుఁ గాత!
కులభేద శస్త్రముల్ తల లవి మొదలంట
ప్రీలి ధారుణిఁ బడవేయుఁ గాత
రాజ్య కాంక్షానలభ్రాజిత జ్వాలలు
వ్రేల్మిడి సాంగత వ్రేల్చుఁ గాత!
అర్థకాంక్ష వార్థు లాక్రోశమునఁ బొంగి
మూల ముట్టంబుగా ముంచుఁ గాత!

కడఁకు గామాంధతామిస్ర గరిమ మిగిలి
నరక కూపంబునం బడ నడచుఁ గాత!
విషయ లోలతా దుర్వ్యాధి వితతి ప్రబలి
కార్శ్య మొందించి మనుజులఁ గడపుఁ గాత!

# షష్ఠాశ్వాసము

మంగళాంతమునకు సభా ప్రాంగణమున
జరిపి రొక పెండ్లి లొట్టియ జంపతులకు
మంగళముఁ బాడె గార్దభాభంగ మిథున
మాత్మ కంఠస్వరము దిక్కులందు మ్రోగ

వెంటనే యొంటియల జంట కుంటు వడక
దంట గానవె గాణల జంటఁ జూచి—
"వింటి మెందఱి గానమో వీను లలర,
నెందునను నిట్టిమాధుర్య మెఱుగరాదు"

లొట్టియల సోయగంబును నట్టెచూచి
పట్ట జాలక గాలిగాం డ్రిట్టులనిరి....
"చూచితిమి దంపతులఁ జాల సుందరులను,
ఎందునను నిట్టి సౌందర్య మెఱుఁగరాదు"

తిరిగి యొక్కరి నొక్కడు తేరి చూచి
పల్లు గదిపిన రీతిఁ గన్పడిన నొట్టు
'చెల్లుఁ గుక్కకాటునకును చెప్పు దెబ్బ
కన్న చందము నిక్కవ మయ్యె నహహా!

అట్టి వన్య మహా సభానంతరమున—

ఖచర సత్త్వ ప్రకాండముల్ గదలియెవరి
యిరవులకు వారు చేరిరి; ఇంక నొక్క
పిల్లి మాత్రము మృగపతి విడువనయ్యె
నగ్గలంబగు నెయ్యంబు నందుఁ దవిలి

పులిని మేకను నొక్క రేవునను నీళ్ళు
త్రావునటు సల్పి మించె మార్జాల పతిగ,
లేక యుండిన విజయ మేలీలఁ గలుగు?
నక్క జిత్తులు పనివడు నొక్కొ యెపుడు
స్వామి భక్తియు శౌర్యంబుఁ జాలకున్న,
అనుచుఁ బొగడెను మృగము లత్యంత భక్తి

ఊరక పొగడుటయే కాక మార్జాలుని గురువుగా నంగీకరించి సమస్త విద్యలు నేర్పు మన బిడాలంబు "వల్లె"యని మిగుల వాత్సల్యంబున—

పదచమత్కృతి కరలాఘవములు సూపె
రాత్రిఁ జీకట్లఁ జూచు నేత్ర ప్రభావ
మెఱుకఁ బఱచెను; వైరుల కొఱకుఁ బొంచి
కడిమి లంఘించి గొంతుకఁ గరవఁ గఱపె.

కడకుఁ జెట్టెక్కు విధమును గఱపు మనుచు
పులులుఁ జిఱుతలు, రాజసింహాలు మృగాద
నములు వెన్నాడి దను వేడ, "నాకు మీర
లధికు లౌదురు సత్త్వము నందుఁ గాన
నగుదు మీకు నేనేకవిద్యాధికుడఁను."

అనుచు మార్జాలు డాడిన నాగ్రహించి,
ఇంత కొనరించిన మహోప కృతుల మఱచి,
యతఁడు గఱపిన విద్యల నవలఁ ద్రోసి,
పలుకరాని దుర్భాషలఁ బలికి రిటుల—

ల్లిఁ జంకను గదియించి పెళ్ళి కార్య
మునకు వెళ్ళిన చందమన్ ముచ్చటెఱిగిఁ
ఎఱిగి, ఈ పిల్లి తీర్పరి నేర్పరింప
రాచ కార్యము లింక నిర్వాహ మగునె?

"పిల్లి ముట్టిన పిండముల్ విత" యటంచుఁ
మానవుల యాడిపోఁతలు మన మెఱుగమె?
ఎల్ల పనులను జెఱుపంగఁ బిల్లి పిల్ల
కీడు లేదని విజ్ఞాను లాడ వినమె?

తాను కనులు మూసి తగ లోకములవెల్లఁ
గనులు మూసి నట్లు గాఁ దలంచి
పాలు ద్రావు పిల్లి ప్రాభవం బెట్టిదో
ఎఱుగ కున్న వార లెవరు కలరు?

వెన్న, జున్ను, పాలు వెట్టు మానవు కనుల్
గాన రాక యుండఁ గా దలంచు;
వెన్న, జున్ను, పాల ప్రేగు భరించెడి
యుట్ల త్రాళ్ళఁ దెగఁగ నొగి శపించు

ఎట్లు విశ్వసించుటెట్టి కృతఘ్నుని<br>
ననుచు వ్యాఘ్రము మాది యయిన వన్య<br>
మృగము లెగ్గు లాడి వృష దంశకంబును<br>
దద్దరిల్ల వెంట దఱిమి కొట్టె

అట్టి యెడ మహా విషాదంబున మార్జాలంబు మనంబున రోషించి కటు భాష ణమ్ముల నిట్లు శపించె—

"అన్ని విద్యలఁ గృతహస్తులై చెలంగి<br>
కుల గురు ద్రోహులౌ కృతఘ్నులను మిమ్ము<br>
మానవులు వేఁటచే రూపు మాపు చుండ్రు<br>
గాత యెల్లప్డు క్రూర మృగమ్ములంచుః

పిల్లి బ్రహ్మ హత్య పిల్ల పిల్ల తరాన<br>
విడువ కంటి రాగఁ గడుపు మండి<br>
కన్న కాను వనగ గడువడి దిగ మ్రింగి<br>
క్రమత వంశ నాశకరులు గండు!"

అని శపించిన పిల్లి జాతి మృగము లెల్ల పిల్లి నెల్లిదంబు పేసి—

పిల్లి శాపోక్తి వితతికిఁ బృథ్వి నెందు<br>
నుట్లు తెగి పడు నోటు నీ యుబుసు పోని<br>
చంద మెఱు కయ్యెఁ; దాటాకు జప్పుడులకుఁ<br>
బెదరి పాఱునె మృగములు వెఱ్ఱివాడ !

తిట్లకును జావ, పర్దిల్ల దీవనలకుఁ,
గలుగు నెడ ధాత్రి యేమనఁగలము ఐౌర!
వేడి నీళ్ళకుఁ గొంపలు మాడకున్నె?
రాలవే చింతకాయలు రాగములకు?

అని నిర్లక్ష్యముగ నిరాకరించి పలుకుటయు,

పాప మట్లు భంగపడిన మార్జాలుండు
సేనతోడ మనుజసేవ కరిగెఁ
ఆ భయంబు చేత నది యిప్పటికిఁ గూడ
మలము విడిచి మాటు సుంటి తోడ,

* * * * *

అని శుకుండు వలుక శౌనకాదు లిట్లనిరి. "మహాత్మా! మీ యనుగ్రహంబున కృతార్థుల మైతిమి. లోక క్రమంబు గుర్తెఱింగితిమి 'ధర్మ సంస్థాప నార్థాయ సంభ వామి యుగే యుగే' అను భగవద్వాక్యమును మన కృష్ణార్జునులును నిరూపించిరి. కాని నాడు వారి వలన జరిగిన సంస్కారము లోక కల్యాణదమైనను తిరుగ విఘాత మొందు చున్నదేల?" నావిని శుకుండు వారల కిట్లనియె "ఇది ప్రకృతి సహజము. లోకమున కెందఱెందరు మహాత్ము లెన్ని తెఱంగుల సంస్కారము లొసంగినను, కాలక్రమంబున నవియెల్ల జాతి 'యెప్పటి కాలట్టె'గా నుండును.

శునక పుచ్ఛమునకు సురుచిర సంస్కార
మెంత చేసిరేని యింతలోన
వక్ర భావ మేమి వదలక యెప్పటి
యట్ల యుండు చంద మనుభవ మెగ!

అని శుకుండు "మహా కౌలీనంబు" సమగ్రంబుగా విన్పింప శౌనకాదులు మహానందులైరి.

పరిసమాప్తము.

# సవరణలు

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 10 | 20 | కడుకు | కడకు |
| 12 | 7 | పసడి | పసిడి |
| 16 | 15 | తేవకువ | తేకువ |
| 17 | 4 | శేతు | సేతు |
| 24 | 1 | ఆది | అది |
| 25 | 15 | స్యచ్ఛమైన | స్వచ్ఛమైన |
| 25 | 19 | ఆనిన | అనిన |
| 27 | 10 | మాధ్య స్త్యము | మాధ్యస్థ్యము |
| 29 | 16 | గుజు | గుజ్జు |
| 31 | 4 | వంచెకుల | వంచకుల |
| 42 | 15 | సిరపఱచికొని | స్థిరపఱచికొని |
| 44 | 1 | దుఃఖమునకు | దుఃఖమునను |
| 45 | 17 | రాజిసింహులు | రాజసింహులు |
| 48 | 13 | పహజ | సహజ |
| 53 | 7 | సత్తసైన్యము | సత్త్వసైన్యము |
| 55 | 6 | దొడబుది | దొడ్డబుద్ధి |
| 62 | 15 | సర్యసేనాని | సర్వసేనాని |
| 69 | 19 | నొండురుం | నొండొరుం |
| 74 | 10 | క్రొమ్ములాడెను | క్రుమ్ములాడెను |
| 83 | 15 | యదుకులంబునం | యదుకులమునం |
| 92 | 8 | ప్రహసన | బ్రహసన |
| 95 | 14 | కట్టిడి | కట్టడి |
| 98 | 14 | తొలగింప | తొలంగింప |
| 99 | 18 | —— | నోయనం గటికిపాల్జేయుచున్నాడు |
| 104 | 9 | నిడుకొన | నిడుకొని |
| 106 | 7 | జలస్తంభము | జలస్తంభనము |
| 106 | 18 | నాక్కయెడల | నొక్కయెడల |
| 106 | 19 | నిలువనీయనీక | నిలువనీయక |
| 109 | 3 | వీరాలజ్ఞానమ్ము | వీరలజ్ఞానమ్ము |
| 110 | 2 | కొమ్ములు | కుమ్ములు |
| 114 | 15 | నేత్రభావ | నేత్రప్రభావ |
| 115 | 5 | ల్లిఁ | పిల్లిఁ |
| 116 | 13 | కానుపనగ | కానుపనక |